# SELECTIONS

IN

# TELUGU PROSE AND VERSE,

## PART I.

BY

RAO BAHADUR K. VEERESALINGAM PANTULU.

---

# గద్య పద్య కావ్య సంగ్రహము.

## ప్రథమభాగము.

ఇది

రాయబహదూర్ కం. వీరేశలింగముపంతులుగారిచేత

వ్రాయఁబడినది.

---

MACMILLAN & CO., LIMITED
MADRAS, BOMBAY, CALCUTTA AND LONDON.

1916.

, 6 *Annas.*] *Rights Reserved.* [వెల, ౬ అణాలు.

# పాఠానుక్రమణిక.

పాఠము. | పుట.

# SELECTIONS

IN

## TELUGU PROSE AND VERSE.

## PART I.

---

# గద్య పద్య కావ్య సంగ్రహము.

## ప్ర థ మ భా గ ము.

---

### 1. సత్ప్రవర్తనము.

సత్ప్రవర్తనమనఁగా మంచినడవడి. అది, మానవులకెల్ల నవశ్యాచరణీయము. ఐహికాముష్మికసుఖప్రదంబును, విమలయశోదాయకంబును సర్వజనస్తోత్రపాత్రంబునగునది. మనుష్యునకమూల్యాభరణము. పశుపక్ష్యాదిజంతువులకంటె జ్ఞానమను విశేషంబుగలిగి, దానిని పెంచు విద్యగలిగి దాని నేర్పు నొజ్జలుంగలిగి, యుక్తాయుక్తంబులును, పుణ్యాపుణ్యంబులునగు కర్జంబులును, వాని నాచరించువారికింగల్గు ఫలాఫలంబులును లోకంబువలన నెఱుంగుచు సత్ప్రవర్తన మవలంబింపని మూఢనరుని జన్మము జననీక్లేశకరంబగుటయేకాక, యతఁడు భూతలంబును పంట చేనికిఁబెట్టిన గడ్డిబొమ్మవంటివాఁడగును.

దానికి విద్యయే ప్రధానకారణమని నమ్మఁదగదు. విద్యయనఁగా జ్ఞానము. అది యిపుడు విపరీతమై లోకమును మోసపుచ్చు ధనాకర్షణమూలమయిన కేవల గ్రంథపఠనముగా నున్నది. దానివలన మర్త్యుఁడెన్నటికిని సత్ప్రవర్తనము పొంతనైనఁ బోఁజాలఁడు. మనమభ్యసింపవలసినది నీతి విద్య. అది

గ్రంథానుభవమువలనను లోకానుభవమువలనను దెలిసికొనఁ దగినది.

వివిధభాషాధురీణులయ్యు ధర్మము తొలంగి కామక్రోధాదిగుణములచేత దూషితులై తాము చెప్పినదే తథ్యమను నభిమానశూరులును మోసకాండ్రునై దుష్కృత్యములకు లోఁబడు పండితమన్యులును, అక్షరజ్ఞానశూన్యులయ్యుఁ బాపమన్న వెఱచి దుష్కార్యములవలను బోక దైవపరులై సజ్జనసహవాసంబున నీతిమార్గమునఁబోవు సుజనులును, లోకమునఁ బెక్కండ్రు గలరు

ప్రపంచములో భగవంతునిచే సృజింపఁబడిన చేతనాచేతనభేదంబగు ప్రతిపదార్థము పరస్పరోపకారంబున కుపయోగపడు సార్థకజన్మము గలదిగానున్నది. సృష్టిలో గుణహీనంబగు వస్తువొండు లేదు. స్వల్పగుణములంబట్టి స్వల్పోపయోగంబులు నధికగుణంబులంబట్టి యధికోపయోగంబులుఁ గన్పట్టుచుండును.

సమస్తజంతురాశిలో మానుషులు సర్వగుణపాత్రములు. వారిలో విద్యాగంధరహితులకంటె విద్యాధికులెక్కుడు. వారిలోఁ గేవల పఠనపాఠసమర్థులకన్న సత్ప్రవర్తనముగలవారుత్తములు.

ఒరులఁ గన్నుమూసి యుదరభరితుఁడై యాత్మజన్మమునకు సాఫల్యంబెఱుంగక స్వప్రయోజనపరుఁడై పరోపకారచింతలేక భగవద్దూరుఁడై నీతిమాలినబ్రతుకు బ్రతుకువాఁడు పశ్వాదులకంటె నధికుఁడు గాఁడు. పనికిమాలిన గడ్డిపోఁచలు నోరులేని మృగాదులును లోకమునకుపయోగపడుచుండ నుత్తమజన్మము గల నరుఁడు నిరుపయుక్తమయిన సంచరణముగలవాఁడయ్యెనేని

యింతకంటె హేయమును హాస్యాస్పదంబును జింత్యమునగు విషయము వేఱుండునా?

సత్ప్రవర్తన మొక రత్నాకరమువంటిది. దానసుగుణ మణులు పెక్కు గలవు. అందు సత్యము, అహింస, ఐక మత్యము, భూతదయాళుత్వము, క్షమ, విద్యావివేకము, సవ్యా పారత్వము, సన్మైత్రి, దైవభక్తి అనునివి నవరత్నములు.



## 2. భూగ్రహము.



భూమండలముయొక్క స్థలజలవిభాగాదులనుగూర్చియు, నదీపర్వతాదులనుగూర్చియు, దేశ సరోవరాదులనుగూర్చియు, భూమిమీఁది యితరవిశేషములనుగూర్చియు భూగోళశాస్త్రము నందు వివరముగాఁ జెప్పఁబడియుండును. ఆ యంశములను బ్రస్తుతమున విచారించుట మన పనికాదు. భూమి నిపుడొక్క గ్రహసామాన్యముగా గ్రహించి దానితో సంబంధించిన విషయములను మనము చర్చింపవలసియున్నది.

భూమియొక్క యుపరిభాగము, సమముగానున్నదా? వంపుగానున్నదా? దాని రూపము చదరముగానున్నదా? గుండ్ర ముగానున్నదా? యను నంశమును మనము ముందుగాఁ దెలిసికో వలెను.

సూర్యునిచుట్టును దిరుగుచుండెడు బుధశుక్రాది సమస్త గ్రహములును గోళాకారముగానే యుండుటచేతను, వానిలో నొక్కటియైన భూమిమాత్రము వేఱువిధముగా నుండుననిి

యూహించుటకు హేతువు గనఁబడకపోవుటచేతను, స్థూల బుద్ధితో విచారించువారికి సహితము భూమి యొక గోళమనియే తెలియవచ్చును. అయినను గొన్ని దేశములవారు కొంతకాలము క్రిందటివఱకును భూమి సమప్రదేశముగా నున్నదని భావించియుండుటనుబట్టియు, పయికి మన చూపులకును భూమి యాలాగుననే కానవచ్చుచుండుటను బట్టియు, భూమి బంతివలె వలయముగా నున్నదని చూపుటకు రెండు మూఁడు నిదర్శనములు గలవు.

మనమొక సమప్రదేశమున నిలుచుండి నలుదిక్కులు దృష్టిసారించి చూచినయెడ దవ్వులనున్న వృక్షపర్వతాదుల కొనలుమాత్రమే ముందు కానఁబడును. మనమాపర్వతాదుల దెసఁబోవుచు సమీపించుకొలఁదిని వాని దిగువభాగములు క్రమక్రమముగాఁ గనఁబడ నారంభించి కట్టకడపట వాని మొదళ్ళు కానవచ్చును.

భువి నారింజపండువలె గుండ్రముగానుండి మనకును బర్వతాదులకును నడుమనున్న భాగమే మన దృష్టి కడ్డమురాక భూమి చదరముగానుండినచో గిరియొక్క పాదము సహితము మనకు మొట్టమొదటనే కన్పట్టును. అంతియకాక మనమా కొండ మొదట నిలిచి చూచినయెడఁ గొంతదూరముమాత్రమే భూప్రదేశము మనకంటికగపడును. ఆ యద్రిపైకిఁ గొంత దవ్వెక్కి నిరీక్షించినయెడల మఱికొంత యధికదూరము భూతలము బగపడును. అమ్మహీధరాగ్రంబెక్కి దృక్కు వ్యాపింపఁజేసినచో వెనుకటికంటె మఱింత యధికదూరము కానఁబడును. ఇదికూడ మనము పయికెక్కినకొలఁదిని గుండ్రముగా నుండుటంబట్టి మన దృష్టికడ్డముగానుండు భూభాగము తొలఁగుచువచ్చి దాని

యావలి ప్రదేశము కానవచ్చుచు ధరణి గోళాకారముగానున్న దని స్థాపించుచున్నది. ఒక్క భూప్రదేశముమాత్రమే కాక సదా సమసూత్రముగా నుండునని మనము భ్రమపడుచుండు జలప్రదేశముగూడ విలువంపుగానేయుండి భూమియొక్క వర్తులత్వమును బూర్తిచేయుచున్నది. సముద్రపురేవున నిలిచి చూచెడుపక్షమున దూరమునుండివచ్చు 'నోడయొక్క చాపకొయ్య కొనలు ముందుగా నేత్రగోచరములగును. పిదప నోడ చేరువకు వచ్చుకొలఁదిని, తెరచాపలు మొదలయినవి కడపట దాని యడుగుభాగము కనుపట్టును. భూమి గుండ్రముగా నుండనియెడ నిట్లు చూపట్టుటకుఁ గారణముండదు. పెద్దది యగుటచే ముందుగా మన కోడక్రిందిభాగమే యగపడవలెను. తీరమునుండి లోపలకుఁ బోవు నౌకల యడుగుభాగములేమున్న దృశ్యములయి తరువాతఁ గొయ్యలులోనగు నెత్తయినభాగములు భూమ్యంతరిక్షములు కలిసికొన్నట్లు కానఁబడెడి దిఙ్మండలముక్రింద నడఁగి మఱుఁగగుటయు భూమి గుండ్రముగానున్న దని స్థిరపఱుచుచున్నది.

ఒక వస్తు వే యాకారము గలిగియుండునో దాని నీడయు నా యాకారముగానే యుండునని యెల్లవారు ప్రత్యక్షానుభవముచే నెఱుంగుదురు. చంద్రగ్రహణసమయములందుఁ జంద్రబింబముమీఁదఁ బడుచుండు నీడ యెప్పుడును గుండ్రముగానే కానఁబడుచున్నందున భూమి వర్తులముగా నున్నదని ప్రత్యక్షముగాఁ దెలియుచున్నది.

ఒక చోటినుండి బయలుదేఱి మఱియేప్రక్కకుఁ దిరుగక ముక్కునకు సూటిగా సముద్రయాత్ర చేసిన నావికులు మొదటఁ దాము బయలువెడలినచోటికే మరలఁ జేరుచువచ్చిరి. భూమి

గుండ్రముగానుండనిపక్షమున వారట్లు యథాస్థలము చేరుట సంభవింపదు.

భూమియొక్క యాకారము నెఱింగినపిదప దాని పరిమాణ మునుగూడఁ దెలిసికోవలెను. తిరిగెడు వెలఁగకాయ బొంగర ములకు నడుమనుండి పుల్లయున్నట్లుగా భూమిమధ్యమున నుత్త రమునుండి దక్షిణమునకున్నట్లు మనమూహించెడి యిరుసునకు, (Axis) అక్షమని పేరు. భూమిలోపలనుండి నిజముగానే యిరు సున్నపక్షమున నయ్యది పైకివెడలెడి భూమియొక్కభాగములలో నుత్తరపుదాని కుత్తరధ్రువమనియు దక్షిణపుదానికి దక్షిణధ్రువ మనియు నామములు. నారింజపండుచుట్టును నడుమను దారము కట్టినట్లుగా నుభయధ్రువములనుండియు నెఱుచూచిన సమ దూరములోనుండులాగున భూమిచుట్టును నడుమనున్నట్లు మన మూహించెడు రేఖకు (Equator) భూమధ్యరేఖయని పేరు. దీనికే విషువవలయమనియు నాడీమండలరేఖయనియు నామాం తరంబులు గలవు. భూమి, కందుకమువలెఁ గేవలము గుండ్ర ముగానుండక ధ్రువములవైపునఁ గొంచెము లోపలకు నొక్కి కొనిపోయి భూమధ్యరేఖవైపునఁ గొంచెము పైకుబికియున్నది. అందుచేతనే భూమియొక్క వ్యాసము (Diameter) అనఁగా, అడ్డుకొలఁత, యొకధ్రువమునుండి యొకధ్రువమునకున్నదాని కంటె భూమధ్యరేఖయొద్ద నొకప్రక్కనుండి యొక ప్రక్కకుండు నది దాదాపుగాఁ బదుమూఁడుమైళ్లు హెచ్చుగానుండును. భూగోళముయొక్క యుపరిభాగముయొక్క వైశాల్యమంతయు 19,66,26,000 (పందొమ్మిది కోట్ల యఱువదియాఱులక్షల యిరు వదియాఱువేల) చదరపుమయిళ్లు. ఇందులో మూఁడువంతులు జలమయముగా నొకవంతు స్థలమయముగానుండును. భూమి

మీఁద నేవిధమయిన రేఖలు లేకపోయినను గణనసౌకర్యార్థము జ్యోతిశ్శాస్త్రవేత్తలు రేఖలున్నట్లు కల్పింతురు. అట్లూహింపఁబడెడు భూమధ్యరేఖనుండి ధ్రువములవఱకు నుత్తరమునఁ దొంబది సమభాగములను, దక్షిణమునఁ దొంబది సమభాగములనుజేసి యాభాగములను దెలిపెడు సమాంతరరేఖలను భూమిచుట్టును వలయాకారముగా నేర్పఱిచి శాస్త్రకర్తలావలయ రేఖలకు (Parallels of Latitude) అక్షాంశవృత్తములని పేరు వెట్టిరి. ఈ యక్షాంశవృత్తిరేఖలు భూమధ్యరేఖకుత్తరమునఁ దొంబదియు దక్షిణమునఁ దొంబదియుఁ గలిసి నూటయెనుబది యుండును. ఈ యక్షవలయరేఖలు నాడీవలయమునుండి యుత్తరముగాఁగాని దక్షిణముగాఁగాని ధ్రువములతట్టునకుఁ బోయినకొలఁదిని పరిధి (చుట్టుకొలఁత) యందంతకంత కొక దానికంటె నొకటి తక్కువగానుండును.

ఇట్లు సమభాగములుగాఁ జేయఁబడిన యొకరేఖనుండి యొకరేఖకుఁగల దూరము భాగయనికాని, యంశయనికాని, చెప్పఁబడు. భాగలో నఱువదవభాగము కలయనికాని, లిప్త యనికాని, చెప్పఁబడును. కళలో నఱువదవభాగము వికళ యనికాని, విలిప్తయనికాని చెప్పఁబడును.

ఈ ప్రకారముగానే నాడీమండలమనఁబడు భూమధ్య రేఖను దూర్పునుండి పడమటకు మున్నూటయఱువది సమభాగములుగా భాగించి యుత్తరదక్షిణ ధ్రువములవఱకు నిలువుగా సరళరేఖల నేర్పఱిచి శాస్త్రకర్తలారేఖలకు (Longitude) రేఖాంశ వృత్తములని పేరు పెట్టిరి. ఈ రేఖలన్నియు ధ్రువములవద్ద నేకముగాఁ గలిసికొనును గనుక భూమధ్యరేఖనుండి ధ్రువముల వంకకుఁ బోయినకొలఁదిని వెడల్పునందవి యంతకంతకుఁ దగ్గు

చుండును. ఇందొక్కొక్క రేఖమీఁద వసించువారికందఱికిని మధ్యాహ్న మేకకాలమునందు వచ్చుటచేత వీనికి మధ్యాహ్న రేఖలనియుఁ బేరు గలదు. ఈ రేఖలు గోళమునకు మున్నూట యఱువదియగుటచే నర్ధగోళమునకు నూటయెనుబదేసి యుండును. పైనిజెప్పినప్రకారముగానే వీనికి సహిత మొకరేఖనుండి వేఱొక రేఖకుఁగల దూరము భాగయనియు దానిలో నఱువదవవంతు కళయనియు దానిలో నఱువదవవంతు వికళయనియుఁ జెప్పఁబడును. అందుచే మనమేదైన నొక మధ్యాహ్నరేఖను గైకొన్నపక్షమున దానికిఁ దూర్పునఁగాని, పడమటఁగాని యే ప్రదేశమును నూటయెనుబది భాగలకంటె నధిక దూరమున నుండదు. భూమధ్యరేఖ యడ్డముగాఁ బ్రాగ్దిశనుండి పశ్చిమ దిశకును, ధ్రువములలోనుండి పోవురేఖ నిలువుగా దక్షిణమున నుండి యుత్తరమునకును, నుండునుగదా?

భూమియొక్క పరిధి 24,800 మయిళ్లయినందున భూమధ్య రేఖను సమభాగములుగా భాగించిన మున్నూటయఱువదిభాగ లలోఁ బ్రతిభాగయు 69½ (అఱువది తొమ్మిదిన్నర) మైళ్లు నిడివిగలదిగానుండును. మనకంటికిఁ గనఁబడు విధమునుబట్టి సూర్యుఁడు భూమిచుట్టు నొకదినములో ననఁగా నిరువదినాలుగు గంటలకాలములో నొకసారి తిరిగి వచ్చునుగాన సూర్యుఁడు గంటకుఁ బదియేను భాగలచొప్పునఁ దిరుగును. అందుచే నొక పట్టణమునకుఁ దూర్పునఁ బదియేనుభాగలలోనున్న ప్రదేశములో నొకగంట ముందుగాను, పడమటను బదియేనుభాగ లలోనున్న ప్రదేశములో నొకగంట తరువాతను సూర్యుఁడు దయించును.

ఈవఱకుఁ జెప్పినట్లుగాఁ బయికిఁ జూచుటకు మనము

వాసము చేయు భూమి స్థిరముగా నిలిచియున్నట్లును, దాని చుట్టును సూర్యాదిగ్రహములు నక్షత్రములును బ్రతిదినము తూర్పునుండి పడమటకుఁ బ్రదక్షిణములు చేయుచున్నట్లును గనఁబడుచున్నను నిజము విచారింపఁగా మన భూమి పడమట నుండి తూర్పునకుఁ దన యక్షము మీఁదఁ దిరుగుచుంటచేత నే యట్లు కనఁబడుచున్నదిగాని, సూర్యచంద్రాదులు తిరుగుట చేతఁగాదు. పూర్వకాలపువారందఱును భూమి స్థిరముగా నుండి సూర్యాది గ్రహములే భూమిచుట్టు తిరుగుచున్నట్లు భ్రమపడి తదనుగుణముగా సిద్ధాంతములను జేసియున్నారు. అయినను దరువాతి వారా భ్రమను గనుఁగొని సహేతుకముగా సత్యమును వెల్లడిపఱుచుటచే నిపుడు పశ్చిమఖండవాసులంద ఱును నైకకంఠ్యముగా భూభ్రమణసిద్ధాంతమునే యంగీక రించియున్నారు. పశ్చిమఖండమునందువలెనే యీ భరత ఖండమునందును మొట్టమొదట మనపూర్వులు నక్షత్రాది భ్రమణమునే చేకొనిరిగాని, కొంతకాలమయినతరువాత హూ ణశకము నాలవశతాబ్దము నందనఁగాఁ బశ్చిమఖండములో భూభ్రమణసిద్ధాంతము కనిపెట్టుటకుఁ జిరకాలముముందే యా ర్యభటాచార్యులవారు తమ సిద్ధాంతగ్రంథములో భూభ్రమ ణము స్థిరపఱిచినారు.

అయిన నీ సిద్ధాంతమునకు మన దేశములో నంతగా వ్యా ప్తికలుగలేదు. ఆర్యభటులవారికిఁ దరువాత హూణశకము 1150–వ సంవత్సరమునందు సిద్ధాంతశిరోమణిని రచియించిన భాస్కరాచార్యులవారును భూమియే స్థిరముగానున్నదనియు భగోళమే తిరుగుచున్నదనియు వ్రాసినారు.

భూమి కదలకుండి గ్రహములే కదలుచున్నను, నక్ష

త్రాదులు చలింపక భూమియే చలించుచున్నను, ఈ లోక ములో సంబంధించియున్నంతవఱకు నక్షత్రాది బాహ్యపదార్థ ముల వ్యాపారములన్నియు మనదృష్టి కేకవిధముగానే తోఁ చును. అయినను, భూభ్రమణము నంగీకరింపని పక్షమున గ్రహనక్షత్రాదులదైనందిన గతి మొదలగువానిని సహేతుక ముగా సాధింప శక్యముగాదు. భూమి చిన్నది. సూర్య మండలము భూమికంటె 1,25,000–ల రెట్లు పెద్దది. ఆకర్షణ శక్తిచేఁ బెద్దదానిచుట్టు చిన్నది తిరుగవలెనుగాని, పెద్దదగు సూర్యమండలము తనకంటె శతసహస్రగుణములు చిన్నదగు భూమండలముచుట్టు తిరుగుట సంభవింపదు. ఇట్లున్నచో భూమియే తిరుగుచున్నపక్షమున, తాఱుమాఱగునపు డడుగు ప్రక్కనుండు మనుష్యులు క్రిందఁబడక నిలువఁగలుగుదు రాయని కొందఱడుగుదురు. క్రిందేమి? మీఁదేమి? గోళా కారముగానున్న భూమికంతయు మీఁదే. ఎక్కడనున్నవాఁ డక్కడనే తాను పైనున్నట్లు భావించుకొనుచుండును. ప్రాగాది చతుర్దిశలను, ఊర్ధ్వాధోదిశలను, ఎక్కడనున్నవాఁడు పైకిఁజూచి నను తన తలమీఁద నాకాశమును, నక్షత్రములనే చూచుచుఁ దాను భూమినంటిపట్టుకొనియేయుండును. తాను భూమిని విడిచి పడకుండుటకు భూమియొక్క యాకర్షణశక్తియే కారణము. భూమి యెపుడును దన శక్తిలోనికి వచ్చిన పదార్థమును భూమ ధ్యాభిముఖముగా నాకర్షించుచుండుటనుబట్టి మానవుఁడుగాని, మఱియేపదార్థముగాని భూమిని విడువక యంటిపట్టుకొని యుండఁగలదు.

భూమియే తిరుగుచున్నయెడలఁ దూర్పునుండి పడమటి దిక్కున కెగిరెడుపక్షి భూభ్రమణవేగముచేత నెప్పుడును మరల

గూఁటినిజేరకయే యుండవలెనని కొందఱింకొక యాక్షేపము చేయుదురు. ఆధారము చలించుచున్నపుడు దాని గతి, యాధేయమునకుఁగూడఁ గలుగునన్న సత్యమును వారు విస్మరించి యుందురు. ఆ సత్యమును మఱచినచో భూమి తిరుగునపుడు దానిమీఁది జలమును వాతావరణమును దానందేలి యాడు పక్షులు మేఘములు మొదలగు సమస్తపదార్థములు భూమితోఁ గూడఁ దిరుగునని వారు తెలిసికొందురు. అయోమార్గమున నావిరిబండిలోఁ బోవువారికి స్థిరముగానున్న చెట్లు, ఇండ్లు, పొలములు, పోవుచున్నట్లు తోఁచులాగున భూమి తిరుగునపుడందలి వారికి స్థిరముగానుండు సూర్యనక్షత్రాదులు తిరుగుచున్నట్లు కనఁబడును. భూమియొక్క పరిధి 24,800 మయిళ్లయినందున భూమి గంటకు 1,033 మయిళ్లచొప్పునఁ దిరుగును.

భూమి నిరాధారముగా నిలిచి సూర్యాకర్షణముచేత నిరంతరము తిరుగుచున్నదన్న సత్యమును గనుఁగొనలేక ధ్రువములనుండి పైకిలేచిన మేరువనెడి యిరుసుమీఁద భూమి నిలిచి యున్నదని కొందఱును సమస్తవస్తువులు పయినుండి క్రిందికిఁ బడునట్లే భూమియు నధోముఖముగాఁ బడుచున్నదని కొందఱును జెప్పిరి. ఈ కడపటి బౌద్ధసిద్ధాంతమును భాస్కరాచార్యులవారు "ఓ బౌద్ధుఁడా! ఆకాశమునం దెగురవేయఁబడినదెల్లను భూమిని జేరుచుండుట చూచియు నాకాశమున భూమి యధోముఖముగాఁ బడిపోవుచున్నదని వ్యర్థముగా నెట్లు తలఁచెదవు?" అని తమ సిద్ధాంతశిరోమణి మూఁడవయధ్యాయమున ఖండించియున్నారు. భూమియే క్రిందుగాఁబడుచున్నయెడఁ, దేలికయగు వస్తువుకంటె బరువగువస్తు వధికవేగముతోఁ బడుచుండుట మనము కనుచుండుటంబట్టి పైకెగురవేయఁబడిన

కందుకాదిలఘుతరవస్తువు లెప్పుడును, తమకంటె గురుతరమై యధికవేగముతోఁ బడుచున్న భూమిని సమీపించుట తటస్థింపక యంతకంత కధికదూరముగాఁ దొలఁగుచు రావలెను. అట్లు జరుగక భూమినుండి పైకిఁ జిమ్మఁబడిన బాణాదిప్రతిలఘుపదార్థమును మరల భూమి మీఁదికే వచ్చుచుండుటచేత భూమి యధోముఖముగాఁ బడుచుండుటలేదని సిద్ధాంతమగుచున్నది. శేషకూర్మవరాహాదులు క్రిందనుండి భూమిని మోచుచున్న వను పౌరాణికమత మసత్యమని భాస్కరాచార్యులవారే సిద్ధాంతశిరోమణి గోళాధ్యాయమునందు "స్వరూపముగల పదార్థమొకటి భూమిని ధరించుననెడుపక్షమున దానిని, భరించుటకు మఱియొకటి దాని కింకొకటియు నీప్రకారముగా ననవస్థ తటస్థించును. అందుఁ గడపటిదానియందు స్వశక్తిని గల్పించెడిపక్షమున మొదటిదైన భూమియందేలకూడదు? అది యష్టమూర్తి యొక్క మూర్తియేకదా?" అని ఖండించిరి. కావున భూమి స్థిరముగానుండక యధోముఖముగాఁబోక సూర్యునిచుట్టు తిరుగుచున్నదని గ్రహింపవలయును.



## 3. రక్తస్వరూపము.



అస్థులుగాని, మాంసముగాని, నాడులుగాని శరీరమందలి మఱియేపదార్థముగాని, విరామములేక పనిచేయుచుండుటచేఁ బ్రతిదినము తప్పక కొంతభాగ మఱుగుదలనుబొంది క్షీణించును, గనుక ఆయా పదార్థములను జెడకుండ మరల యథాస్థితి యందుంచఁదగిన పోషణపదార్థమొకటి యవశ్యముగా నుండి యుండవలెనని కొంచె మాలోచించువారికందఱకును దెలి

యును. కావున నిపుడారక్షణపదార్థమయిన రక్తమునుగూర్చి కొంత విచారింతము. రక్తములో నేయేపదార్థములున్నవో దాని రూపమెట్లుండునో యది యేయంగముల కేప్రకారము-గాఁబోయి పోషణము నిచ్చునో, ముందు విచారింపవలసియున్నది. రక్తము జలమువలెఁ బ్రవహించెడు ద్రవపదార్థము. అది జలముకంటెఁ జిక్కగాను బరువుగానునుండును. మనమొక రక్తబిందువును భూతదర్పణముతోఁ బరీక్షించిన పక్షమున దానియందు, కణములు (Blood Corpuscle,) అని చెప్పఁబడెడి యణురూపములైన యెఱ్ఱని గుండ్రని ఘనపదార్థము లపారముగాఁ గానఁబడును. ఈ కణములలోఁ బ్రత్యేకముగా నొకదానిని జూచినపుడు కొంచెము పసుపువర్ణముగా నుండునుగాని, యన్నియు మొత్తముగాఁజేరి యెఱ్ఱగానుండును. నెత్తుటియొక్క యెఱ్ఱఁదనమంతయు వీనివలననే కలుగును. ఈ శోణకణములు మిక్కిలి మృదువుగానుండి క్షణములో విఱిగిపోవును. ఈ యరుణకణములఁ బరిశోధించి చూచినయెడల వానిలో నడుమ నడుమ నించుమించుగా మూఁడేసివందల కొక్కటిచొప్పునఁ గొంచెము పెద్దవిగాను, బంతులవలె గుండ్రముగానునుండు తెల్ల కణములు కానఁబడును. అవి విచిత్రములైనవి. అవి రక్తములోఁబడి దొర్లుచుఁ గొట్టుకొని పోవునపు డాకారము మాఱి యొకప్పుడు గుండ్రముగాను, మఱియొకపుడు కోలగాను, ఒకప్పుడు కోణములు గలవిగాను, ఒకప్పుడు చదరముగాను, మఱియొకప్పుడు నిలువుగాను, నానావిధరూపములను బొందుచుండును. ఎఱ్ఱకణములు సామాన్యముగా దొంతులుగాఁ బేర్చిన బేడకాసులవలె నొకదానికొకటి చేరియుండి రక్తములో మహావేగమునఁ గొట్టుకొనిపోవుచుండును.

మన యవయవములలో నేదియైనఁ దెగుటచేతఁగాని, మఱియొకవిధముగాఁగాని రక్తముక్రిందఁ బ్రవహించినపుడు కొంచెముసేపటిలోఁ బేరుకొని గడ్డకట్టును. అట్లు గడ్డకట్టికొను గుణము దానియందుండఁబట్టియే సాధారణమయిన గాయము యినప్పుడెల్లను రక్తమంతయుఁ బైకిరాక నిలిచిపోయి యెండి గాయము మానును. రక్తము ఘనీభవించినపుడు దానిని మనము చక్కఁగాఁ బరిశీలించినయెడలఁ గొంతభాగము జలమువలెఁ గాఱినట్లుగూడఁ దెలియును. ఒక గిన్నెలోఁ గ్రొత్త నెత్తురు పోసి కొంచెముసేపు వేచియుందుమేని, అందులోఁ గొంత భాగము పేరి కరుడుకట్టి, మఱి కొంతభాగము పాలు విఱిగి నప్పుడుండినట్లు నీరుగా వేఱుపడును. కరుడుకట్టినభాగమును నల్లయనియు ద్రవరూపభాగమును రసియనియు వాడుదురు. రసికి వసయని సంస్కృతనామము. ఈ రసి నీటివలెఁగాక పసుపువర్ణముకలదిగానుండును. అది యుదకమువలెఁ బైకిఁ గానఁ బడినను కేవల జలముగాక, కోడిగ్రుడ్డులోని సొనవలెనుండును. కోడిగ్రుడ్డులోని సొన నిప్పులమీఁదఁ బెట్టినపు డెట్లు గట్టిపడునో యట్లే నెత్తుటిలోని రసియంతయుఁ గాఁచినపుడు గట్టిపడును. ఈ రెంటియందును శ్వేతధాతువు విశేషముగానుండును.

మనము క్రొత్తరక్తమును గిన్నెలోఁబట్టి దానిని గవ్వ ముతోఁ జిలికినయెడల నది పేరుకొనక ద్రవముగానేయుండును. అపుడాకవ్వమున కడుగున మృదువయిన నారవంటి తెల్లని పదార్థమంటుకొనును. దానిని దీసివేసినయెడల నెత్తురు పేరు కొనక యెప్పుడు పలుచగానేయుండును. నారవంటి యీ మెత్తనిపదార్థమునకు (Fibrin) తాంతవమని పేరు. ఈ పదార్థ మందుండఁబట్టియే చిన్నదెబ్బలు మొదలయినవి తగిలినప్పుడు

రక్తము విశేషముగాఁ బోక పేరుకొని యపాయము కలుగకుండును. రక్తములోని తెల్లకణము లీతాంతవమును జేయుట కుపయోగించునని యూహించుచున్నారు. రసవాదశాస్త్రజ్ఞులు శోధించిచూచి రక్తములో మన దేహపోషణమున కనుకూల పడెడు వివిధములైన పదార్థము లిరువదియైదు జాతులకంటె నెక్కువగానున్నవని కనిపెట్టియున్నారు. రక్తములో, జలము, గంధకము, భాస్వరము, (Phosphorus) ఇనుము, చక్కెర, లవణము, సున్నము, శ్వేతధాతువు, క్రొవ్వు, తాంతవము మొదలగు పదార్థములు పెక్కులు గలవు. వాని పాళ్లవిషయమయి శాస్త్రజ్ఞులలోనే కొంచెమభిప్రాయభేదమున్నది. వేయిభాగములలోఁ గొంచెము తక్కువగా నెనిమిదివందల భాగములు జలముండును. ఆ మొత్తమేకారణముచేతనైనను దగ్గినపుడు మనకు దప్పికపుట్టి జలపానముచేయుటచేఁ దక్కువైన జలము పూర్తి యగును. ఆ మొత్తమునకన్న జలమెక్కువైనపక్షమున, స్వేదము వలనను, మూత్రమువలనను నెక్కువయినభాగము పోవును. రక్తమునందు వేయిటిలో నూటనలువదిపాళ్లెఱ్ఱకణములును శ్వేతధాతు వఱువదిపాళ్లకంటె నధికముగాను, తాంతవము మూఁడుపాళ్లును, క్రొవ్వు రెండుపాళ్లును, ఇనుము మొదలయిన ఖనిజము లాఱుపాళ్లును, ఉండును. శరీరములో, మేదస్సు, కండరములు (Muscles), లోనైన మెత్తనిపదార్థములకు రక్త మధికముగాఁ గావలెను. ఎముకలు, ఉపాస్థి మొదలయిన కఠిన పదార్థముల కల్పముగాఁ గావలెను. వీనిలో శ్వేతధాతు తాంతవములు మాంసపోషణమునకును, ఎఱ్ఱకణములు వేఁడిని బుట్టించి పనికిమాలినపదార్థములను దహించుటకును, క్రొవ్వు చమురు తిత్తులపోషణమునకును, సున్న మెముకలపోషణమున

కును, జలము దేహమును శుభ్రపఱుచుటకును, మృదువు చేయుటకును, చల్లపఱుచుటకును, ఉపయోగించును. మేదస్సు, కండరములు, అస్థులు మొదలయిన కాయములోని సమస్తావయవ సముదాయమును రక్తము తమ యొద్దకు వచ్చినపుడు దానిలోనుండి తమకుఁ గావలసిన పోషణపదార్థమును స్వీకరించి తమలోని నిరుపయుక్తపదార్థముల నందు విడుచుచుండును. తనకుఁ గావలసిన యాహారమునకంటె నధికముగాఁ దినకుండుటవలన రక్తము పరిశుద్ధమయిన స్థితియందుండును. భోజనముచేసిన తరువాత రక్తములోఁ దెల్లకణములు కొంచె మధికముగా నుండును. ఎఱ్ఱకణములలోలేని యణువొక్కటి తెల్లదానిలో నడుమనుండును. మాంసాహారమువలన నెఱ్ఱకణము లధికమగును. ధాన్యాహారమువలనఁ దక్కువగును. ఎఱ్ఱకణము లాహారలోపమువలనను రక్తక్షీణతవలననుగూడఁ దక్కువగును. ఇనుము మొదలయిన ఘనపదార్థములు స్త్రీలయొక్క పిల్లలయొక్క దేహములలోకంటె నారోగ్యదశలోనున్న పురుషుల రక్తములో నధికముగానుండును. రోగముచే రక్తము మాఱును. అపుడు కొన్ని యంగముల కత్యధికరక్తమును కొన్ని యంగముల కత్యల్పరక్తమును బోవును. స్ఫోటకము మొదలయిన సాంక్రామికరోగము లుపవాసములుచేయునపుడు సులభముగా నెత్తుటిలోఁ బ్రవేశించును. కాఁబట్టి యుపవాసములు వ్యాధి జనకములగుటయు, వ్యాధులు, భగవంతుఁ డేర్పఱిచిన శరీరధర్మమును మీఱుటవలనఁ గలిగెడు శిక్షారూపములయిన ఫలములగుటయు విచారించి తిండిమానుట వలన భగవదనుగ్రహముకలుగునన్న వెఱ్ఱినమ్మకమును విడిచి దీనిం జదువువారప్పుడపుడు జ్వరములు నజీర్ణరోగములు వచ్చు

నెడ నొకటిరెండు పూటలు తప్ప, పుణ్యమువచ్చునని యుపవాసములుచేయక సామాన్యముగా నారోగ్యప్రదమయిన యాహారమును యుక్తసమయమున భుజించుచుందురుగాక! ఉబ్బు మొదలయిన వ్యాధులయందు రసిపయి కూరి లోపలి రక్తమును జిక్కపటిచి యపాయము చేయును. మనుష్యుల దేహములలోఁ గొందఱు పదివీసెల రక్తముండుననియుఁ గొందఱేడువీసెలుండుననియుఁ గొందఱంతకంటెఁ దక్కువయుండుననియుఁ జెప్పియున్నారు. ఆయా మనుష్యుల దేహబలమునుబట్టి రక్తముయొక్క తూనికలో హెచ్చుతగ్గులుండును. ఎట్లయినను శరీరముయొక్క బరువులోఁ బండ్రెండవవంతుకంటెఁ దక్కువగను, ఆఱవవంతుకంటె నధికముగను సాధారణముగా నుండదు. అయిదుమణుగులు తూఁగెడు మానవుని శరీరములో నాలుగు వీసెల రక్తమయినను సామాన్యముగానుండును. కావున సర్వావయవంబులను బోషింప రక్తమే ప్రధానమనియు దానిని యుక్తాహారవిహారంబుల వృద్ధిపఱుపవలయుననియు మనకీపాఠమువలనఁ దెలియుచున్నది.



## 4. ఐకమత్యము.



పెక్కండ్రొక్కవిషయంబున నొక్క బుద్ధిగలిగియుండుటయె యైకమత్యమనఁబడు. సర్వకార్యసిద్ధులకు నిట్టి యైకమత్యమే ప్రధానము. ఒక్క యన్నము గావలయుననిన భూమి దున్నుట మొదలుగా వంటచేసిపెట్టువఱకెందఱు పనిచేయవలయును? మనము నివసించు గృహము పలువుర సాహాయ్యము

లేక యొకనిచే నిర్మింపఁబడనేరదు. అధిక ప్రయాసముంగొనియు నొక్కనికి సాధ్యముగానిపని, పదుగురైకమత్యముగలిగి పాటుపడుదురేని సులభసాధ్యమగును. యావచ్ఛక్తి నుపయోగించి నను నొక్క బలాఢ్యుఁడు సహిత మీడువలేనిరథమును బలహీనులగు బాలురు సైతము పలువురు చేరి యవలీలగా లాగుదురు.

మనుష్యుని సుఖమునిమిత్తమయి కావలసిన యెల్లకార్యములకుఁ బలువుర తోడ్పాటుకావలెనని యెప్పుడు తేలుచున్నదో యప్పుడే మనుష్యులను బరస్పరసాహాయ్యమపేక్షించు జీవులుగాఁ బరమేశ్వరుఁడుద్దేశించి సృజించెననియు నీశ్వరోద్దేశమునకు విరుద్ధముగా నన్యసాహాయ్యమపేక్షింపక మర్త్యుఁ డేకాకిగానుండుటకుఁ బ్రయత్నించినపక్షమున సుఖపడఁజాలఁడనియు స్పష్టమగుచున్నది.

మిత్రబాంధవులతోడి సంబంధము పెట్టుకొనక యేకాకియై తిరుగువాఁడు మృగప్రాయుఁడు. స్థావరంబులగు ద్రుమంబులుగూడ నొక్కపోగుగానుండి ప్రచండమారుతంబునకైన వంగకపోవుట గనమె? అట్టిచో నశేషలోకజ్ఞానసంపన్నులు సకల విద్యాధురీణులు సర్వసాధనయుతులునగు నరుల కైకమత్యములేకుండుట గర్హ్యమును జింత్యమునుగాని కలుగుట యంత శ్లాఘాపాత్రముగాదు. ఐకమత్యమే నిక్కపు నాగరికతకు గురుతు. మనదేశము పూర్వము పరదేశీయుల యధీనమగుటకుఁ గారణము మన యైకమత్యాభావమే. మనలోఁ బూర్ణమయిన యైకమత్యమే యుండెనేని యెట్టివారును మన దేశము వంకనైనం దేఱిచూడనోపకపోవుదురుగదా? హిందువులలో నైకమత్యములేమియే యీదేశము నన్యదేశప్రభువులకు

లోఁ బఱిచి మనలను వారికి దాసులుగాఁ జేసి కొలువు సేయించుచు ననేక దుర్దశలం గుడుపుచువచ్చినది. వెనుక మన దేశమునకుఁ దురుష్కులు ప్రభువులైయున్నపుడు మన పెద్దలంబఱిచిన పాటులు తలంచుకొన్న నిపుడును మనసు నొచ్చుచున్నది. ఇపుడు మన భాగ్యవశము నన్యాయైకదృష్టిగల హూణులప్రభుత్వమబ్బినదిగాన నట్టి కష్టము లేవియులేక కొంతవఱకుఁ దల యెత్తికొని సుఖముగా జీవించుచున్నారము. ఐకమత్యము లేనిచో సంఖ్యకు జనులెందఱుండియు లాఁతివారికశ్రమసాధ్యులగుదురు. సురాజాదౌలా యేఁబదివేలసైనికులఁ గలిగియు నోడి పాఱుటయు మూఁడువేలమందితో సంత సైన్యమును క్లైవు జయించుటయు నెందుచే సంభవించెనో చరిత్రలు చెప్పుచున్నవి. ఒకదాని యపేక్ష యొకదానికి లేకయే జీవింప భగవన్నిర్మితంబులగు సహజాధారంబులు గలిగియు నడవులలో నెనుములు వాజిలు నిభంబులు మొదలగు మృగంబులు మందలుగా నివసించుచు హర్యక్షాది దుష్టసత్త్వంబులకులోనుగాక నిలుచుచున్నవన, నొకనిసాయ మొకనికిలేక యొక్క నిముసమయినఁ గాలము గడపనేరని మానవుల కైకమత్యమావశ్యకమనుట యబ్బురమా? నీచములగు కాకాదితిర్యక్కులుగూడ నాహారవిహారంబుల నైకమత్యముగలిగి ప్రవర్తించును. అన్యోన్యసాహాయ్యములేక సంఘీభవింపకయున్నచో లోకములో మనుష్యునంత దుర్బలమయిన జంతువేదియు లేదు. జంతువులలో మిక్కిలి చిన్నదని భావించు చలిచీమ సమీపించినను గుట్టునేమోయని భయపడి నరుఁడు దూరముగాఁ దొలఁగవలసినవాఁడగును. స్వభావముచే నింత దుర్బలుఁడగు మనుష్యుని

బలమంతయు సంఘీభావములోనున్నది. "సంఘేశక్తిః కలౌ యుగే" యన వినమే? పురుషునకు దేహబలమెట్టిదో సంఘమున కైకమత్యమట్టిది. సంఘబలములేక యేదేశము నెప్పుడు వృద్ధికిరాలేదు. అది లేనిచోఁ దాము దమదేశము నభివృద్ధికి వచ్చుట కల్ల. దుర్యోధనసైన్య మైకమత్యములేక నశించినది. చలిచీమలు సయితమేకీభవించి త్రాఁచుపామును జంపును. "బలవంతమైన సర్పము చలిచీమలచేతఁజిక్కి చావదె? సుమతీ!" యని చదువమె?

ముట్టుకొనిన విడిపోవు జనుపనార ముప్పేటవడి పెద్దయోడల లాగును. తుదకు వెంటిగాఁ జుట్టఁబడిన వరిగడ్డితో నేనుఁగును బంధింపవచ్చును. దయామయుఁడగు నీశ్వరుఁ డన్నిటియందును నైకమత్యమువలనఁ గలుగు ఫలము లిట్టివియని కనఁబడునట్లు చేసియున్నాఁడు. జంతుకోటిలోఁ బ్రధానులయిన మానవు లిట్టియైకమత్యము సత్కార్యములందుపయోగించి తమ్మును దమదేశమ్మును వృద్ధిపఱిచి దానివలని పలులాభములఁ బొంది యేల సౌఖ్యపడరాదు?

ఎంత బుద్ధిశాలియైన నెంతవిద్యాధనవంతుఁడైన నొక్క పురుషుఁడు సంఘబలములేక యేకార్యముఁ జేయఁజాలఁడు. ఐకమత్యమువలని గొప్ప లాభము సుఖజీవనము. ఇందులకుఁ దార్కాణంబుగ నొక కథగలదు.

ఒక గ్రామంబున నొక శూద్రుఁడు గలఁడు. అతనికి నల్వురు కొమరులు గలరు. వారు నిత్యము కానకేగి కట్టెలు తెచ్చి విక్రయించికొని జీవించుచుండురు. ఇట్లుండి యాసోదరులు కొంతకాలమున కజ్ఞానవశంబున గృహవ్యవహారంబులఁ గలహపడి మనంబుల నసహనంబులు పెంచికొని తగవులాడు

చుండి లోకులకు లోకువయై యధైర్యవర్తనులుకాఁగాఁ దండ్రి వారిం జేరఁజీరి యొక పుల్లలమోపు వారియెదుటఁబెట్టి యొక్కొకనితో "నాయనా! యీ మోపు విఱువు"మని నియోగించె. ఒక్కఁడు నక్కార్యంబు చేయఁజాలఁడయ్యె. పిదప నావృద్ధు తత్పూలకంబు విప్పి యొక్కొకకర్రను విఱువుఁడన నొక్క నిమేషకాలమున విఱిచి యక్కడఁబెట్టిరి. పిదప జనకుఁడు తన యులంగాంచి మీరు కలసిమెలసి యున్నంతకాలము పరుఁడు మీవైపు కన్నెత్తి చూడఁజాలకుండె. ఇపుడో పదుగురకు హాస్యాస్పదులరై బలహీనత నొరులకుఁ జులకనైతిరి. కావున నైకమత్యమువలని లాభంబెఱింగి పరస్పరవిరోధముఁ బెంచికొనక ప్రబలధైర్యంబున సుఖపడుఁడని నీతిసెప్పె. దేశమంత యు నేకగ్రీవముగా నుండుటకంటె గొప్ప బలమేదియులేదని యీకథ తెలుపుచున్నది.



## 5. సుమిత్ర చరిత్రము.



పూర్వకాలమున సింహళద్వీపమును సుమిత్రుఁడను రాజు పాలించుచుండెను. ఆయనకు రూపవతియు గుణవతియునగు మంజువాణియను రాణి గలదు. వారిరువురు పరస్పరానురాగము గలవారయి యపారసౌఖ్య మనుభవించుచుండిరి. ఈ యుత్తమ నాయికామణితోడి ప్రణయముచేత, నతనికి బాల్యసఖుఁడును సహపాఠియునయిన చంద్రవర్మయను మలయాళదేశపురాజును మరలఁ జూచి యాతనికిఁ దన ప్రియభామినియొక్క సద్వర్త నముఁ జెప్పవలెనని యపుడపుడు పుట్టు నభిలాషతప్ప వేఱుకోరిక

యేమియు లేకుండెను. సుమిత్రుఁడును జంద్రవర్మయుఁ జిన్నట నాఁటనుండియు నొకచోటనే యేకముగాఁ బెరిగిరి. కాని వారి తలిదండ్రుల మరణానంతరమునఁ దమదేశముల నేలుటకయి యెడఁబాయవలసివచ్చినందున వారు తఱుచుగా బహుమాన ములను నుత్తరప్రత్యుత్తరములను బ్రియపూర్వకములయిన క్షేమవార్తలను బంపుకొనుచుండినను, బహుసంవత్సరములనుండి యన్యోన్య ముఖావలోకనములు లేకయుండిరి.

ఇట్లుండ సుమిత్రుఁడు తన్నొకసారివచ్చి చూచిపొమ్మని మిత్రునకు మాటిమాటికి వర్తమానములు పంపుచువచ్చినందున మలయాళమునుండి బయలుదేఱి చంద్రవర్మయుఁ బరిమితపరి వారముతో మిత్రసందర్శనార్థము సింహళద్వీపమునకు వచ్చెను. ఈ సమావేశమువలనఁ జిరకాలమెడఁబాసియుండి యాకస్మిక ముగాఁ గలిసిన యామిత్రుల కిరువురకును గలిగిన యానంద మింతంతయని చెప్పనలవికాదు. రాకరాకవచ్చిన తన చిన్న నాఁటిమిత్రునకు సకలోపచారములుసేయుచుఁ జక్కగాఁ బరా మర్శింపవలయునని భార్యకు బోధించుటయేకాక, తనప్రాణ సమానుఁడయిన బాల్యమిత్రుఁడు సరసనుండి చూచుచుండఁ బట్టి యిపుడుకదా నా సౌఖ్యము పరిపూర్ణతగాంచెనని సుమి త్రుఁడు మనసులోఁ బరమానందభరితుఁడయ్యె. మిత్రులిద్ద ఱును దమ బాల్యావస్థయందలి చేష్టలు దలఁచుకొని యానం దించుచు సల్లాపంబుల నుల్లాసంబు గనఁబఱుచుచు సమీప ముననుండు మంజువాణితో వేడుకగాఁ జెప్పుచుండిరి. ఇట్లు కొంతకాలము జరిగినపిదపఁ జంద్రవర్మ తనదేశమునకు వెళ్ళుట కయి, ప్రయాణముకాఁగా భర్తకోరికప్రకారము మఱికొంతకాల ముండి వెళ్లుమని యాతనిని మంజువాణి ప్రార్థించి చెప్పెను.

ఈ యుత్తమకాంతయొక్క సంతాపదినములు నాఁటితోఁ బ్రారంభమయ్యెను. సుమిత్రుఁ డెంత ప్రార్థించిన నిలువ నోడఁబడనివాఁడు, మంజువాణియొక్క మృదుమధురవాక్యములచే మనసుకరఁగినవాఁడై దీనత్వముతో వేఁడికొను నామె ప్రార్థనమును ద్రోచి పుచ్చలేక చంద్రవర్మ మఱికొన్ని వారముల వఱకును దన ప్రయాణము మానుకొనెను. తనమిత్రుని సుగుణ సంపదయుఁ దనయిల్లాలి సత్స్వభావమును జిరకాలానుభవము వలన లెస్సగాఁ దెలిసినవాఁడయ్యు వేళావిశేషముచే సుమిత్రుఁడు భార్యయందును మిత్రునియందును నిగ్రహింపరాని యసూయగలవాఁడయ్యె. పెనిమిటి యానచే నాతని ప్రీతిఁబడయుట కాకాంత ప్రతిదినము చంద్రవర్మవిషయమయి చూపుచు వచ్చిన శ్రద్ధయంతయు దురదృష్టవంతుఁడైన యానృపాలుని మనోవేదనావృద్ధికే తోడుపడసాగెను. సుమిత్రుఁడు పూర్వము ప్రియురాలియెడ నెంతప్రేమగలవాఁడును, బ్రియమిత్రునియెడ నెంత దయగలవాఁడునునయియుండెనో యిపుడంత యీర్ష్యయు నిర్దయత్వమునుగల ఘోరరాక్షసుఁడుగా మాఱి తన సభికులలో నొకఁడగు బహుమానునిఁ బిలిపించి రహస్యముగా నాతనితోఁ దనకుఁగలిగిన యవమానమును జెప్పి చంద్రవర్మను విషప్రయోగముచేసి చంపుమని యుత్తరువుచేసెను.

బహుమానుఁడు దూరాలోచనగలవాఁడును యోగ్యుఁడును గాఁబట్టి తనరాజు సందేహమునకు లేశమయిన నవకాశము లేదని యెఱిఁగినవాఁడయి విషముపెట్టుటకుమాఱుగాఁ దన ప్రభువునాజ్ఞ నాయనకు నివేదించి సింహళద్వీపమునుండి తప్పించుకొని యాయనతోడఁగూడి వెడలిపోవుటకొప్పుకొనెను. చంద్రవర్మయు బహుమానుని సాయముచేతఁ దనరాష్ట్రములో

సుఖముగాఁ బ్రవేశించెను. అప్పటినుండి యక్కడ రాజసభలో బహుమానుఁడు ప్రధానుఁడై యాతని కత్యంతమిత్రుఁడయి యుండెను.

బహుమానుఁడు పాఱిపోవుటచే మండిపడి రాజు మఱింత కోపముతో రాణియున్న యంతఃపురమునకు వెళ్లి యచ్చటఁ దన ముద్దులతనయుఁడయిన కృష్ణుఁడు తల్లితో నేదో కథ చెప్పుచుండఁగా వినుచుఁ గూరుచున్న భార్యను జూచి కుమారు నావలకీడ్చి భార్యను జెఱసాలయందుఁ బెట్టించెను. కృష్ణుఁడు మిక్కిలి పసివాఁడయ్యుఁ దల్లియందుఁ బ్రేమగలవాఁడయి యుండెను. కాఁబట్టి తల్లి నవమానపఱిచి కారాగృహము నకుఁ బంపుచుండఁజూచి గుండెలు పగిలిపోయి దినక్రమమున క్షీణించి తుదకు మరణావస్థను బొందునట్టి స్థితికి వచ్చెను. రాజును దన రాణి నట్లుపంపి చతురాస్యుఁడను, సత్యసారుఁడను నిద్దఱు భృత్యులఁ బిలిపించి, మీరు తిరువనందపురముననున్న దుర్గగుడికిఁబోయి నామీఁద మంజువాణికి మోహముకలదో లేదో తెలిసికొనిరండని పంపెను.

రాణికిఁ జెఱసాలలోనున్న కొంతకాలమునకుఁ గూఁతురు పుట్టెను. చక్కని యాచిన్నపిల్లను జూచుకొనుటవలనఁ గొంత యూరటచెంది యామె "నా కన్నతల్లీ! నీవెంత నిర్దోషురాలవో నేను నంత నిర్దోషురాలనేసుమీ" యని యాచిన్నదానిని జూచి పలికెను. ఆ పతివ్రతాతిలకమునకు రాజబంధుఁడైన వక్రచిత్తునిభార్య మిత్రవిందయను నామె ప్రియసఖిగానుండెను. ఆ బిడ రాణికిఁ బుత్రికకలిగినదను వార్త విన్నతోడనే చెఱసాలకేగి యామెకుపచారముకొఱకుంచఁబడిన మాలినియను పరిచారికం గాంచి "మాలినీ! రాణిగారు నాయందు నమ్మకముంచి పిల్లను

నాకిత్తురేని యాపిల్లను రాజుగారికిం జూపెదనని నీవు వెళ్లి యామెతో మనవిచేయుము. పిల్లను జూచుటచే మనసుకరగి యాతనికి రాణిమీఁద దయవచ్చునేమో? యెవరెఱుఁగుదురు" అని చెప్పెను. మాలినియు మిత్రవిందంజూచి "తల్లీ! మీరు సెలవిచ్చినట్లిపుడేపోయి రాణిగారితో విన్నవించెదను. ఆమె నేఁటియుదయముననే యాపసిబిడ్డను గొనిపోయి రాజుపాదముల మీఁదఁ బడవైచెడు పుణ్యాత్మురాలెవరైన దొరకునా? యని విచారింపఁజొచ్చినది" అని పలికెను. ఆమాటకు సంతోషించి "మాలినీ! రాజుగారిసమక్షమున నేను దనపక్షమున ధైర్యముతో వాదించెదనని రాణిగారితోఁ జెప్పుము" అని మిత్రవింద చెప్పెను. అనపరాధినియైన రాణిగారికి మహోపకారము చేయఁబూనుకొన్న నీకు శాశ్వతసుఖము గలుగుఁగాకయని మిత్రవిందను దీవించి రాణితో సర్వవృత్తాంతము విన్నవించి యామె ప్రీతిపూర్వకముగానిచ్చిన యాబాలికను బొత్తులలోఁ గొనివచ్చి మాలిని యాపుణ్యసతియొక్క చేతిలోఁబెట్టెను.

ఇట్టి క్రుద్ధును దీసికొనిపోవలదని నిర్బంధించు నిజనాథుని వాక్యము సహితము లక్ష్యముచేయక మూఁకలలోనుండి త్రోవ చేసికొని రాజుసన్నిధికిఁబోయి, మిత్రవింద యానెత్తురుగందును రాజుపాదములమీఁదఁ బడవైచి మోమోటమిలేక రాజు క్రూర కృత్యమును గర్హించి యేదోషము నెఱుఁగని మాతా శిశువుల దయతోఁ జూడుమని వేఁడికొనెను. ఆమె న్యాయనిష్ఠురము లాడి హితముచెప్పినకొలఁదిని రాజున కాగ్రహముబలిసి యామెను దన యెదుటినుండి కొనిపొమ్మని యామె పెనిమిటితో నుత్తరువుచేసెను. ఒంటిగానున్న యాశిశువును జూచిననైన జాలి పుట్టునేమో యని, యాబిడ్డను, తండ్రికాళ్లసమీపముననే

విడిచి మిత్రవింద వెళ్లిపోయెను. ఆమె కొలువుఁబాసి వెళ్లిన తోడనే దయాశూన్యుఁడైన యాతండ్రి వక్రచిత్తునిఁబిలిచి "నీ వీ బిడ్డను గొనిపోయి సముద్రముదాటి నిర్జనారణ్యమున దిగఁ బెట్టి రమ్మని" యాజ్ఞాపించె.

వక్రచిత్తుఁ డుత్తమాంగనయగు మిత్రవిందవంటివాఁడు కానందున వెంటనే యొక పడవనెక్కి రాజాజ్ఞచే ముందుగా నిర్మానుష్యమయిన యడవి యెక్కడఁ గనఁబడునో యక్కడ నాబిడ్డను బాఱవేయవలెనను నుద్దేశముతో బయలుదేఱెను. రాజు మహాకోపముతో, దేవతావాక్యమును దెచ్చుటకు వెళ్లిన సత్యసారుఁడు చతురాస్యుఁడు రాకమున్నె, కన్నకూఁతురి గతి విని మూర్ఛపోయి తేఱి కన్నకడుపు దహించుకొనిపోవ రాణి విలపించుచుండఁ దన సభలోని మంత్రి ముఖ్యుల సమక్షమున బహిరంగముగా భార్యనేరమును విచారింప నామెను రప్పించె నెను. ఆమె నేరమును విమర్శింప నెల్ల న్యాయాధికారులు రావింపఁబడిరి. అపుడు వారియెదుట నీసమంతయు దోసము లేని యాయోషిద్రత్నము మహాపరాధము చేసినదానివలె దీన త్వముతో నిలువఁబడి వారి తీర్పువిన నెదురుచూచుచుండెను. ఇంతలో సత్యసారుఁడు చతురాస్యుఁడు సభామంటపముచేరి పదిలముగా ముద్రవేసిన దేవతావాక్యములుగల యుత్తరమును సగౌరవముగా రాజునకు సమర్పించిరి. అంత సభ్యులలో నొకఁడు రాజాజ్ఞచే ముద్రవిడఁగొట్టి యందలి మాటలందఱు విను నట్లుగా నిట్లు చదివె.—"మంజువాణి కేవల మనపరాధిని, చంద్ర వర్మ కళంకరహితుఁడు. బహుమానుఁడే నిజమైన భృత్యుఁడు. సుమిత్రుఁడు నిష్కారణముగా జారత్వశంకనుబెట్టుకొన్న క్రూ

రుఁడు. ఇపుడు చంపఁబడిన కూఁతురు దొరకకపోయిన రాజు సంతులేనివాఁడయి మృతినొందును."

రాజుమాటల విశ్వాసముంచక యిదంతయు రాణియొక్క మిత్రులచేఁ బన్నఁబడిన తంత్రమని పలికి న్యాయాధిపతి కభిముఖుఁడయి నీవు రాణిని విమర్శింప నారంభింపుమని యానతిచ్చెను. భూపతి యీ మాటలు పలుకుచుండఁగానే యొక సేవకుఁడు పఱుగెత్తివచ్చి రాజపుత్త్రుఁడగు కృష్ణుఁడు తనతల్లిని బ్రాణాంతశిక్షను బొందించుటకయి విమర్శచేయుచున్నారని విని వ్యసనముచే సిగ్గుచే మైమఱచి యాకస్మికముగా మృతినొందె నని చెప్పెను.

ఆమాట చెవిసోఁకగానే మంజువాణి మొదలు నఱికిన యరఁటిచెట్టువలె నేలఁబడి మూర్ఛిల్లెను. పుత్త్ర మరణవార్త రాజహృదయమునకు శూలమువలె నాటినందున నభాగ్యురా లయిన యిల్లాలియందుఁ గొంత కనికరము జనించి రాజు మిత్రవింద నామె పరిచారికలంగని రాణి నావలకుఁ దీసికొనిపోయి శైత్యోపచారములు చేయుఁడని యాజ్ఞాపించె. కొంతసేపటికి మిత్రవింద మరలఁ జనుదెంచి యామె మరణము నొందెనని చెప్పెను.

సుమిత్రుఁడు భార్యమరణమును విని తన దుష్కార్యము నకుఁ బశ్చాత్తాపపడఁజొచ్చెను. తన బాధవలననే యామె మనసు వికలత్వమొందెననియు నామె నిర్దోషురాలనియు నిప్పుడాయన తలంచెను. ఉన్న యొక్క కుమారుఁడు పోయినందునఁ జంపఁబడిన కొమార్తె దొరకనిపక్షమునఁ దాను సంతానములేకుండ మృతిపొందవలసినది వాస్తవముగాఁ గనఁబడఁబట్టి యిపుడా దేవతావాక్యముల నమ్మకముతోఁచెను. కావున నా పిల్లవిషయ

మయి తన రాజ్యమునైన విడువవలెనని నిశ్చయించుకొని రాత్రిం దివములు దుఃఖసముద్రములో మునిఁగియుండి బహుసంవత్సరములు వ్యసనముతో దీర్ఘవిచారముతో రాజు కాలముగడపుచుండెను.

వక్రచిత్తుఁడు రాజపుత్రిక నెక్కించుకొనిపోయిన పడవ గాలివానవలనఁ గొట్టుకొనిపోయి చంద్రవర్మ రాజ్యముచేయు మలయాళదేశతీరమునే చేరెను. వక్రచిత్తుఁ డక్కడ దిగి "కావు కావన" నేడ్చు నాబిడ్డను దయమాలి యొకచోట విడిచి తన పడవవైపునకు వెళ్లెను. కాని "నీ కూఁతు నచ్చట దిగవిడచి వచ్చినా"నని సుమిత్రునితోఁ జెప్ప మరల రాలేదు. అతఁడు వెనుకఁదిరిగి పడవకు వెళ్లుచుండఁ జేరువనున్న యడవిలోనుండి యొక వ్యాఘ్రమువచ్చి యాతనిఁ జంపి తగినశిక్షను జేసెను. రాణి యా చిన్నదానిని రాజుకడకంపినపుడు సొగసుగాఁ గనఁబడునట్లుచేసి మఱి పంపినది. అందుచే నిపుడాచిన్నది యమూల్యవస్త్రములతో రత్నఖచిత సువర్ణాభరణములతో నలంకరింపఁబడియుండెను. వక్రచిత్తుఁడు తాను బయలుదేఱివచ్చునపు డొక కాగితముమీఁద "ప్రమతి" యని వ్రాసి దాని నా చిన్నదానివస్త్రమున కంటించిపోయెను. దానిమీఁదనే యామెది గొప్పవంశమనియు దైవవశమున దుర్దశ ప్రాపించినదనియు సూచించు పదములుగూడఁ గొన్ని వ్రాయఁబడియుండెనుగాని యవి స్పష్టముగాఁ దెలియఁదగినవిగా నుండలేదు.

మేఁకలను మేపుటకై కానకువచ్చిన గొల్లవాఁ డొకఁడా చిన్నదాని రోదనము విని దయార్ద్రహృదయుఁడై దాపునకు వచ్చి పిల్లనెత్తుకొని యింటికేగి తన భార్యకీయ నా గొల్లదియుఁ

దన బాలికలకన్న నెక్కువప్రేమతోఁ బెంచుచుండెనుగాని, యా గోపకుటుంబమువారు తమ నిరుపేదతనముచే సర్వాభరణములతో నా చిన్నది తమకు దొరకినసంగతిని దాఁచవలసినవారైరి. అందుచే వారాప్రదేశము వదలి యా దేశమునకు రాజధానియైన యనంతసేనమునకు సమీపముననున్న పల్లె చేరి ప్రమతినగలలోఁ గొన్నిటిని విక్రయించి పశువులమందలను గొని విశేషధనవంతులుగానుండిరి. ఆ ప్రమతియు వారియింట ననురాగమునఁ బెంపఁబడి కాలక్రమమున యావనదశను బొందెను. ఆమె గొల్లపిల్లలకంటె విశేష విద్య నేర్చుకొనకపోయిన నామె సహజబుద్ధిప్రవర్తనములఁ జూచినవారందఱు చిన్ననాఁటినుండియు నామె రాజమందిరములోఁ బెఱిగినదికాదని యెంచుటకవకాశము లేనివారుగానుండిరి.

మలయాళదేశరాజైన చంద్రవర్మకును రామవర్మయను కుమారుఁ డొక్కఁడేయుండెను. అతఁ డొకనాఁడు వేఁటకుఁబోయి యా గొల్లవాని యింటిసమీపమున వచ్చుచు గుమ్మములో నిలుచున్న యా చిన్నదానినిఁజూచి యద్భుతపడి మోహాపరవశుఁడయ్యెను. వెంటనే యతఁడు మాఱువేషమువేసికొని కందర్పుఁడనుపేరున నా గొల్లవాని యిల్లుసొచ్చి నాఁడుమొదలు తఱుచుగా నక్కడకు రాకపోకలు సలుపుచుండె. చంద్రవర్మయుఁ గుమారుని స్థితికి సందేహపడి యాతని జాడలను గనిపెట్ట దూతల నియమించి వారివలనఁ దనపుత్రుఁడు గోపకామినిమీఁద మనసుగలిగియుండుట తెలిసికొనెను. చంద్రవర్మ వెంటనే ప్రాణమిత్రుఁడగు బహుమానుని రప్పించి యాసంగతి చెప్పి ప్రమతి తండ్రియైన గొల్లవానియింటికిఁ దనతోఁగూడ రమ్మని కోరెను.

చంద్రవర్మయు బహుమానుఁడు నిద్దఱు మాఱువేషములు వేసికొని గోపులింద్రోత్సవము జరిగించు సమయమున నావృద్ధగోపకునిమందిరముదగ్గఱకు వెళ్లిరి. గొల్లవాఁడాయిరువుర కతిథిసత్కారములు గావించి యుత్సవములోఁ దనతోఁగూడ నానంద మనుభవింపఁ బ్రార్థించెను. ఆనందభరితులై యెల్లవారు త్రుళ్లుచుఁ గేరుచునుండిరి.

ఈప్రకార మందఱా బాలగోపాలము సందడిగా నుండఁగా రామవర్మయుఁ బ్రమతియు నా యుత్సవముపొంతకుఁబోవక రహస్యస్థలమున నన్యోన్య సరససల్లాపములతోఁ గాలము గడపుచుఁ గూయుచుండిరి. తన కుమారుఁడు తన్నానవాలుపట్టుటకు వలనుగాకుండ మాఱువేషము ధరించుటచే రాజును వారిరువుర సంభాషణము వినఁబడునంత దగ్గఱకు వెళ్లియుండెను. ఆచిన్నది తన పుత్రునితో మాటలాడిన వాక్యములు ప్రౌఢములు గాకపోయినను గడుమధురములుగానున్నందున రాజునకుఁ గలిగిన యద్భుతమునకుఁ బరిమితిలేదు. అపుడు రాజు బహుమానుని వంకఁజూచి "హీనజాతిలో నింత సౌందర్యవతిని వినియుఁగనియు నుండలేదు. నా బుద్ధికిమె హీనకులజయని యూహింపఁదగిన యాధారము కనఁబడలేదు" అని చెప్పెను. నిస్సంశయముగా నీకన్య గోపకులమునకు రాణియై యుండునని యతఁడు పలికెను.

అపుడు రాజు ముసలిగొల్లవానికడకు వచ్చి "ఓయీ! నీ కొమార్తెతో మాటలాడుచున్న చిన్నవాఁడెవఁ"డని యడిగెను. "అతనిపేరు కందర్పుఁడు ఆ పిల్లమీఁదఁ బ్రేమగలదని చెప్పుచున్నాఁడు. అతనికి నా కూఁతును వివాహముచేసికొను యోగముండెనేని యతఁడు కలలోనైనఁ జూడని లాభముతోడఁ

గూడ నామె రాఁగలదు" అని యమ్మఁగా మిగిలిన ప్రమతి యొక్క యాభరణములని భావమునందుంచుకొని వాఁడు బదులు చెప్పెను.

రాజు తరువాతఁ గుమారునివంక మరలి "ఓ చిన్నవాఁడా! యిదేమి? ఈ యుత్సవము నిరాకరించి నీమనసు దేనిమీఁదనో లగ్నమయినట్లు తోఁచుచున్నది. నేను యౌవనదశలోనున్న పుడు నా మనసు తగిలిన మగువలకెన్నియో నూడిదలిచ్చు చుండెడివాఁడను. వినోదకరములయినవస్తువు లమ్మువారట్లుపోవు చున్నను నీవేమియుఁ గొనిపెట్టకపోవుట యెంతయు వింతగా నున్నది" అని మాఱుగొంతుకతోఁ బలుక నా రాచకొమరుఁడు తన తండ్రియనుమాట లేశమయిన నెఱుఁగక "ఓయి వృద్ధుఁ డా! యీవస్తువుల నీమె గౌరవింపదు. ఈ ప్రమతి గోరు పెద్ద నూడిద నా హృదయాంతరాళమున నున్నది" అని ప్రమతివం కఁ దిరిగి "నావలెనే పూర్వమెప్పుడో నీవంటి మోహనాంగిని గామించి తిరిగియున్న యీ ముసలి వినుచుండ నా మనసు తెలిపెదను. ఓ ప్రమతీ! పరాకులేక వినుము" అని పలికెను. అంతతో నూరకుండక యతఁడు మా వివాహనిర్ణయమును జూడుమని పలికి తాను ప్రమతితోఁజేసిన వాగ్దానమునకు సాక్షిగానుండుమని యావృద్ధునడిగెను. రాజంతట మాఱు వేషము తీసివేసి కొడుకు గద్దించుచు "వివాహవిమోచనము చూచెద"నని పలుకుచు వెఱ్ఱి గొల్లవానిపిల్లను బెండ్లియాడ సాహసించినందులకు నిందించి ప్రమతివంకఁ జూచి "యిఁక ముందెప్పుడైన నా కుమారునిరాక కంగీకరించితివేని నిన్ను నీ తండ్రినిఁ గూడఁ జంపించెదనని బెదరించి తన తనయుని వెంటఁ

గానిరమ్మని బహుమానునితోఁ జెప్పి మహాకోపముతో రాజింటి కేగెను.

రాచబిడ్డయొక్క స్వభావము దాఁగియుండదు కాఁబట్టి రాజు వెళ్లినతరువాత నాతని దూషణభాషణములకుఁ గోపించి మనకందఱకు హాని ప్రాప్తముకానున్నను నేనపుడేమియు భయపడలేదు. ఒకటి రెండుమాఱులు రాజును బలుకరించి యాయనతో "మీ రాజభవనముమీఁదఁ బ్రకాశించు సూర్యుఁడే సంకోచింపక మా కుటీరముమీఁదఁగూడఁ బ్రకాశించుచు మిమ్ము మమ్మును సమానదృష్టితోనే చూచుచున్నాఁడని స్పష్టముగా మొగముమీఁద ననవలె ననుకొంటి"నని పలికి పిమ్మట విచారగ్రస్తురాలయి "యీవఱకేమో కలగనుచున్నాను గాఁబోలు! ఇపుడు మేలుకొన్నాను. నన్ను విడిచి మీరు పొండు. నా మేఁకల పాలుపితుకుకొనుచు నా పాట్లు నేను బడుచుండెద"నని నిస్పృహతోఁ బలికెను.

దయాహృదయుఁడగు బహుమానుఁడు ప్రమతియొక్క యనువర్తనమునకు ధైర్యమునకు మెచ్చుపుట్టి మోహాంధకారనిమగ్నుఁడగు రాజనందనుఁడు జనకుని యాజ్ఞామాత్రమునఁ బ్రాణసమానయైన యామానినిని విడిచి రాఁజాలఁడని రూఢిగా నెఱిఁగినవాఁడై యేలాగుననైన నా కాముకీకాముకుల నేకీభవింపఁజేయు మార్గము వెదకి చిరకాలమునుండి తన మనసులోనున్న యొక యాలోచన నీడేరుచు కొనవలెనని నిశ్చయించెను. సుమిత్రుఁడు నిజముగాఁ బశ్చాత్తప్తుఁడుగా నుండెనని బహుమానుఁడు చిరకాలముక్రిందటనే యెఱిఁగియుండెను. ఇపుడు చంద్రవర్మకుఁ బ్రియమిత్రుఁడుగానుండియుఁ దన పూర్వప్రభు

వును జన్మభూమిని మఱియొకసారిచూడ నాసనుమాత్రము బొత్తిగా వదలలేదు. కావున రామవర్మను, ప్రమతిని, తనతోఁ గూడ సింహళద్వీపమునకు రావలసినదనియు నచ్చట సుమిత్రుని మధ్యవర్తిత్వమునఁ జంద్రవర్మవలన క్షమాపణమును బడసి వివాహమున కనుమతిని బొందువఱకును మిమ్ముఁ గాపాడుట కారాజు నొడఁబఱిచెదనని చెప్పెను.

ఈ యాలోచనమునకా యిద్దఱంగీకరించినందున బహుమానుఁడే ప్రయాణమునకుఁ గావలసిన సామగ్రిని సిద్ధముచేసి యావృద్ధగోపకునిఁగూడఁ దమతో వచ్చుట కొడఁబఱిచెను. ఆ గోపవృద్ధు ప్రమతియొక్క తక్కునాభరణముల నామె చిన్ననాఁటిబట్టలను వానికంటించిన కాగితమునుగూడఁ దనతోఁ గొనిపోయెను. సముద్రప్రయాణము చేసి వారందఱు సుమిత్రుని రాజధాని చేరిరి. పోయిన పత్నీపుత్రులఁ దలఁచుకొని మనోవ్యాధితోనున్న సుమిత్రుఁడు బహుమానునిఁ బ్రేమతో నాదరించి రామవర్మ కతిథిసత్కారము గావించెను. రామవర్మకుఁ గాఁబోవు రాణియని బహుమానుఁడు కనఁబఱిచిన ప్రమతి మీఁదనే రాజుదృష్టియంతయు నుండెను. ఆమెయందుఁ దన భార్య పోలిక కనఁబడినందునఁ గ్రొత్తదుఃఖము లోపలినుండి బయలువెడలి "నేనట్లు కఠినచిత్తుఁడనై చంపింపకుంటినేని నా కూఁతురు నిటువంటి చక్కని కన్నియయగును జుండీ" యని కంటఁ దడిపెట్టెను. ఆవెనుక రామవర్మవంకఁదిరిగి "ఉత్తముఁడైన నీతండ్రియొక్క చెలిమిని నిష్కారణముగాఁ బోఁగొట్టుకొంటిని. ఆ ప్రాణమిత్రు నేలాగుననైన నొకసారి చూడవలెనని యున్నది" అని పలికెను. ఆ చిన్నదానిని రాజంతశ్రద్ధతోఁ జూచుటయుఁ దనపిల్ల యెపుడో తన యాజ్ఞచేతనే యడవులలో

విడిచిపెట్టఁబడినదని చెప్పుటయు విచారించి యాగొల్లవాఁడా కాలమును విధమును గొప్పకులంబునఁ బుట్టినదాటకు సాక్ష్యమిచ్చుచుండఁ దనకు దొరకిన యమూల్యాభరణాదులను విమర్శించి రాజుపోయినదనుకొను కూఁతురే యీ ప్రమతియని నిశ్చయించెను. అప్పుడు రామవర్మయుఁ బ్రమతియు బహుమానుఁడును మిత్రవిందయు నందఱును గూరుచుండి యుండఁగా, నా ముసలిగొల్లవాఁడు ప్రమతిదొరకిన విధమును, ఆమెను విడిచిన మనుష్యునిఁ బెద్దపులి చంపుటయుఁ జెప్పి యా యాభరణంబుల బట్టలఁ గాగితముల రాజు నెదుటఁ బెట్టెను. వానినిఁజూచి మిత్రవింద యా వస్త్రములను, నగలను మంజువాణి తనకూఁతున కలంకరించినవనియు నా పత్రికమీఁది యక్షరంబులు తన మగని వేయనియు నానవాలుపట్టఁగా నచ్చటివారికందఱికిని సందేహనివృత్తియయి యామె సుమిత్రుని పుత్రికయాట విస్పష్టమయ్యెను. పోయిన పుత్రిక దొరకుటచే దేవతావాక్యప్రకారము రాజువంశము భూమిమీఁద నిలిచినదను సంతోషమును, భర్తపోయినాఁడన్న విచారమును, మిత్రవిందను నిశ్చేష్టురాలినిఁగాఁజేసెను. ప్రమతి తన కొమార్తెయని తెలిసి రాజు తన బిడ్డను చూచుకొనుటకుఁ దల్లికి ఋణములేక పోయెఁగదా యని దుఃఖించి "నీతల్లి నీతల్లి" — అను మాటలు దక్క మఱేమియుఁ బలుకలేక నివ్వెఱఁగొంది యుండెను.

రాజట్లుండ, మిత్రవింద సమీపమునకువచ్చి సుప్రసిద్ధుఁడగు చిత్రకారునిచేఁ జేయించిన మంజువాణివిగ్రహమొకటి తనయింట నుండెననియు దాని నేలినవారు చిత్తగించిన నిజముగా మంజువాణి యనుకొనునంత విచిత్రముగా నున్నదనియు మనవిచేసెను. రాజు తన ధర్మపత్ని రూపముచూడ నత్యా

సక్తుఁడయి, ప్రమతి తానెపుడు చూచి యెఱుఁగని తల్లి యాకార మేవిధముగానుండునో కనవలెనని యతికుతూహల యయి యున్నందున నందఱును గలిసి యక్కడకు వెళ్లిరి. ఆ విగ్రహమున కడ్డముగానున్న తెరఁదీసి మిత్రవింద చూపఁగానే యచ్చముగా విగ్రహము మంజువాణినిఁ బోలియున్నందున రాజు దుఃఖోద్రేకంబునఁ జిత్రపుఁ బ్రతిమవలె నిశ్చేష్టుఁడయి యుండెను.

అపుడు మిత్రవింద రాజున కభిముఖురాలై మహాప్రభూ! మీ నిశ్చేష్టతఁజూచి పనివాని శిల్పకలాకౌశలమున కత్యద్భుత పడుచున్నట్లు మీరు కన్పట్టుచున్నందున నేను మిక్కిలి ప్రమో దించుచున్నాను. ఈ విగ్రహము కేవలము శ్రీ రాజ్ఞివారివలె నుండలేదా? యని యడిగెను. "రాజును దుదకు నెద పదిల పఱుచుకొని నిస్సందేహముగా నేను వరించినపు డేప్రకారముగా నున్నదో యిపుడు నదేవిధముగా గంభీరముగా నిలుచున్నది. కాని, మంజువాణి నిజముగా నీ విగ్రహము కనుపట్టునంత వయస్సు చెల్లినదికాదు" అని చెప్పెను. అంత మంజువాణి యింతవఱకును జీవించి యుండిన నిపుడేరీతిగానుండునో యట్లే విగ్రహముచేసిన పనివాని నేర్పును మఱెంత మెచ్చుకోవలసి యున్నది. దేవరవారు చూడఁగాఁ జూడఁగా విగ్రహము కదలు చున్నదని భ్రమింతురేమో యని భయమగుచున్నది. "ఇఁకఁ దెరవేయనిండు" అని మరల మిత్రవింద పలికెను. "తెరవేయఁ బోకు. బహుమానా! చూడు—నీకది శ్వాసము విడుచుచు న్నట్లు కనఁబడలేదా? దాని కనురెప్పలయందుఁ జలనమున్నట్లు కూడఁ గన్పట్టుచున్నది." అని రాజు బహుమానునకుఁ జూపెను. ఇంతలో మిత్రవింద "దేవరవారికిపుడు గలిగిన సంతోషము

చూడఁగా నది జీవించియున్నదని సహితము తలంతురు. ఇపుడు నేను, దెరవేయవలెను" అనెను. రాజు మిత్రవిందా! ఇరువది వత్సరములైన నన్నాలాగుననే తలఁచునట్లు చేయుము. ఇపుడు నా దివ్యసుందరవిగ్రహమునుండి యూపిరి వచ్చుచున్నట్లే నాకుఁ గనఁబడుచున్నది. ఎంత వింత యులియైన విగ్రహమున కూపిరి వచ్చునట్లు చెక్కఁగలుగునా? దాని నొకసారి ముద్దుపెట్టుకొనె దను మీరెవ్వరును బరిహసింపకుఁడు అని మోహపరవశుఁడై పలికెను. దేవా! తాళుఁడు. ఆమె పెదవికివేసిన రంగింకను బచ్చిగానే యున్నది. అది మీ పెదవికంటుకొనును. నేను దెర దిగవేయుదునా? అని మిత్రవింద యడిగెను. "వద్దు, వద్దు, ఇరువదేండ్లయిన నిట్లే యుండనిమ్ము" అని రాజు వేఁడు కొనెను. ఈ సంభాషణము జరుగుచున్నంతకాలము మోఁకాలి మీఁద నిలిచి నోరు కదలింపక జననీ నిరుపమాన విగ్రహము వంకనే చూచు ప్రమతి "నా ప్రియమాతను జూచుచు నెంత కాలమయిన నిట్లుండఁగల"నని పలికెను. అంతట మిత్రవింద రాజువంకఁ జూచి "యీ యాలోకనసౌఖ్యమును గొంతసేపు మఱచి తెరవైనవేయ ననుజ్ఞయిండు. లేదా? యింతకంటె నద్భుతము నొకదానిని జేసెద నందునకైన సమ్మతింపుఁడు. నిజ ముగా నేనీ విగ్రహమును గదలునట్లు చేయఁగలను. అంతి యేకాదు—దేవరవారి సెలవయ్యెనేని పీఠమునుండి దిగివచ్చి మీ హస్తము పట్టుకొనునట్లు చేయఁగలను. అట్లు చేసిన నేనేదో క్షుద్రదేవత యుపాసనవలనఁ జేయుచుంటినని తలం తురు. కాదని ప్రమాణము చేయఁగలను" అని చెప్పెను. అందులకు రాజు విస్మయపడి నీవేమిచేయించినఁ గన్నులపండువు

గాఁ జూచెదను. ఆమెచే నీవేమి మాటాడించినఁ గర్ణరసాయనముగా వినఁగలనని పలికెను.

మిత్రవింద యంతకుముందే సిద్ధపఱచినట్లు మంగళతూర్యంబులు మ్రోగ నంద ఱచ్చెరువుపడునట్లు విగ్రహము దిగివచ్చి చేతులతో సుమిత్రుని కంఠము గౌఁగిలించికొని భర్తకుఁ బుత్రికకు శుభంబులొసంగ భగవంతునిఁ బ్రార్థించుచు మాటాడసాగెను. అందుల కాశ్చర్యపడనక్కఱలేదు. ఆ విగ్రహము నిజముగా జీవించియున్న రాణియే. వెనుకటి యాపత్సమయమున రాణి ప్రాణములు గాపాడ నుపాయాంతరములేమి "రాణి కాలముచేసిన"దని రాజుతో మిత్రవింద గొప్ప యసత్యము చెప్పెను. నేఁడు ప్రమతి దొరకినదను శుభవార్త వినువఱకుఁ దాను జీవించియున్నట్లు రాజునకుఁ దెలియ నిష్టములేనిదై యప్పటినుండి మంజువాణి యోగ్యురాలగు మిత్రవిందతోఁ గలిసి యొరులెఱుఁగకుండ నామె యింటనె తల దాఁచుకొని యుండెను. ఆమె తన యాపదల మఱచియు రాజు పిల్లయెడఁ జేసిన క్రూరకృత్యము మఱచిపోలేదు.

పోయిన పెండ్లము బిడ్డలు దొరకుటచే రాజు పొందిన యానందమునకు మితములేదు. ఎక్కడఁజూచిన శుభవాద్యములు సంతోషవాక్యములు తప్ప మాఱేమియు వినఁబడలేదు. సంతుష్టాంతరంగులగు నాదంపతులు హీనజాతినాతిగా నెన్నఁబడినప్పుడు సహితము తమ కూఁతును వరించినందులకు రామవర్మను, పిల్ల వాత్సల్యముతోఁ బెంచిన గొల్లవానిని బహువిధములఁ గొనియాడిరి. తమ ప్రయత్నములు నెఱవేఱినందులకు మిత్రవిందయు బహుమానుఁడు సంతసించిరి. ఎవ్వరెఱుఁగని యీ సంతోషములో నేలోపములేకుండఁ జంద్రవర్మకూడ

నాకస్మికముగా రాజమందిరము చొచ్చెను. కొడుకును బహుమానుఁడు గనఁబడకపోవుటచే వారిరువురు సింహళద్వీపములో దొరకుదురను తలంపున బయలుదేఱె సుమిత్రుని జీవితకాలములో మిక్కిలి సుదినమయిన యీ సంతోష దినముననే యచ్చట నుట్టిపడెను.

చంద్రవర్మ సంతోషించి యక్రమముగాఁ దనమీఁద జారత్వశంకను మోపిన సుమిత్రుని యపరాధము మన్నించి యెప్పటి మైత్రిగలవాఁడయ్యెను. చంద్రవర్మ తన కొడుకునకుఁ బ్రమతిని జేసికొననని నిరాకరించుచున్న భయమేమియులేదు. ఆమె సింహళద్వీపమున కుత్తరాధికారిణియయిన రాజయువతిగానుండె. కావునఁ బ్రమతి రామవర్మల కతివైభవముతో వివాహము జరిగెను. చిరకాలము కష్టపరంపర ననుభవించిన సుకృతాత్మురాలయిన మంజువాణి శ్రమయంతయు నాఁటితో సమాప్తమయినందున నామె పుత్రికతోఁ బెనిమిటితోఁ గలిసి సకల సంపదలఁ దులఁదూగుచు బహుకాలము సమస్తసౌఖ్యముల ననుభవించుచుండెను.



## 6. అహింస.



గీ॥ దంతి యడుగులోనఁ దక్కిన జంతుచ
యంబు నడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటులన్నియు లోనగు
నిద్ధగుణ! యహింస కింత నిజము.

ఎల్లవారును మనోవాక్కాయకర్మంబుల నేనాఁడును బ్రాణికోటికి హింసగోరక యుండవలయు. హింసయనఁగాఁ జంపుట,

దొంగిలించుట, బాధించుట, యని యర్థము. ఇందు బాధించుట బహు విధము. పరులఁ దూలనాడుట, యన్యుల కృత్యంబుల కంతరాయంబులు సేయుట, యొరుల మనసు నొచ్చు చెట్టసేఁతల పాల్పడుట, యుపకృతి నెపంబున స్వాశ్రితులఁ బెక్కు తెఱఁగుల వెతలఁబెట్టుట, క్రోధాయత్తుండై భృత్యాదులమేను నొవ్వఁగొట్టుట, యనునవి యాదిగా ననేకంబుగలవు. ఇట్టిది గానిది యహింసనాఁబడు. "అహింసా పరమోధర్మః" యని కలదుగదా? కాఁబట్టి ధర్మములలోనెల్ల నుత్తమధర్మము, సర్వ భూతములందు సదయుఁడయి యుండుటయె. భూతదయగల మానవుఁడు లోకములో సర్వజనసంభావనీయుఁడై దాక్షిణ్య చిత్తుఁడని పేరువడసి కీర్తికాస్పదుండగును. అట్టి ప్రఖ్యాతిగల వాని నెఱిఁగినవారు నెఱుఁగనివారుగూడఁ బ్రేమాతిశయంబున గౌరవించుచునే కీడునుం జేయకుందురు. దానంజేసి యట్టివాఁ డిహలోకసౌఖ్యములనెల్లఁ గొల్లగొనును. అట్టివానికిఁ గాలవక్రతచే నెప్పుడైన నించుక యాపద సంభవించినను సర్వజనసమ్మతుఁ డగుటంజేసి జనులందఱు నా యాపదం దమ యాపత్తుగా భావించి కొని తోడుపడి యాతని నా యాపదవలనఁ బాపఁజూతురు. ఇందునకు మాఱుగా భూతదయలేనివాఁడు బహుజనద్వేషంబున లోకంబున గర్హ్యుఁడగును. అందువలన వానిని జనులెప్పుడును సర్పమునువలె ద్వేషబుద్ధితోఁ జూచుచు సమయు సమయంబు సేయుచుందురు. పిపీలికాది మనుష్యపర్యంతముగల జీవరాశిలో నెద్దానినైన నెందుచేనైనఁ బరిమార్పక పోవుటయే పరమధర్మువు. కొందఱు విలాసార్థముగాను మఱికొందఱు స్వోదర పోషణమునకుఁగాను బశుపక్ష్యాదులఁ జంపుట మనము నిత్యము గనుచున్నాముగదా? దయామయుఁడగు భగవంతుఁడు, కుక్షి

రక్షణంబునకు బహువిధపదార్థసంతతి నొసంగియుండ నిరపరాధంబులగు మృగవిహంగాదులఁ జంపుట యెట్టినీతి? దుష్కార్యంబునందైన సత్కార్యంబునందైనఁ గర్త, కారయిత, ప్రేరకుఁడు, అనుమోదకుఁడని నల్వురు సమభాగులు గలరు. చిరకాలము తమకుఁ గండపెలుఁగఁ బయోదానంబుచేసిన ముసలియావులను, ఎండయనక, కొండయనక బుభుక్షాపిపాసాపీడితంబులైనను, గాఁడి బుజమున వైచికొని దున్ని దున్ని తమకు ధాన్యరాసులం గూర్చిన వృద్ధోక్షంబులను గటికివాండ్రకు విక్రయించు క్రూరచిత్తులా? వానింగొను చండాలురా? హింసకులు? అట్టివారు నరమాంస భక్షకులగు ఘోరనరాధము లిపుడెవ్వరైన నుండిన నిరర్థకులగు జననీజనకులఁగూడఁ దిండిదండుగయేల యని విక్రయింపకుందురా? హింస యొక్కింతయుఁ జేయఁగూడదని యింతగా నొక్కి వక్కాణించుటయెల్ల నక్రమముగా నేనుఁగు మొదలుకొని దోమవఱకునుంగల యే జంతువునకును బాధ గావింపవలదనుటయే కాని, క్రూరకర్ములందు సయితము దయ గలిగియే యుండవలెననుటగాదు. కొందఱట్టి యభిప్రాయముం జేకొనియె కాఁబోలును నల్లులు, పేలు, తుదకు వృశ్చికంబులు, భుజంగంబులాదిగాఁగల దుర్జంతువుల సహితము దయార్ద్రబుద్ధితోఁ జూచుచు వానివలన బాధపడునప్పుడైన వానిని హింసింపక విడుతురు. అట్టివారిని వాస్తవముగా నహింసకులని చెప్పనైతిగాదు. ఏలయనఁగా నట్లు విడువఁబడిన యవి కాలక్రమమున జనములపాలి యపమృత్యుదేవతలో యనఁ బెక్కండ్రఁ బాధించును. అందుచే నిష్కారణముగా సత్పురుషోపద్రవంబు గూడ సిద్ధించును. ఇట్టి హానికంతయు మొదల వదలివేసిన

పుణ్యాత్ముఁడే హేతుభూతుఁడుగాన నాతఁడొక్క క్రూరజంతువు నందుఁ గరుణగలిగి పెక్కండ్రు సాధువులకుఁ గటికితనంబున హింసఁ గావించినవాఁడగును. మొట్టమొదటనే యా విషజంతువును మట్టుపెట్టిన నిర్హేతుకముగ నిట్టి చెట్టలట్టి సాధువులకుం బుట్టవు కదా? మఱికొందఱు, జనులందఱు తమ్ము భూతదయాళురని మెంచి గౌరవముసఁ జూతురను తలంపున నెలుకలు, చీమలు మొదలగు జంతువుల కలుగులదాపున బియ్యములోనగు నాహారపదార్థములు పెట్టించి వానిం బెంచి యిరుగుపొరుగు వారికిని దమకును మితిలేని హానిం దెచ్చిపెట్టెదరు. ఇట్టివారును మెట్టుమీఁద దయాశూన్యులనియే చెప్పనొప్పుదురుగాని లేశముగాని సదయహృదయులనిపించుకొనరు. ఇంకను గొందఱు నేల నడచునపుడు తమ యడుగునంబడి చిన్నజంతువులు మడియునోయను శంకంజేసి పట్టిపట్టి యడుగులుపెట్టుచుఁ దుట్టతుదకు దాపుననున్న పురుగులఁ ద్రొక్కుదుమను భయమున నంగలు వైచి దూరపువానిందప్పక నలగఁద్రొక్కుదురు. వారు స్వాభావికమయినవిధమున నడిచిరేని నిక్కముగా నన్నిపురువులకు హానిగలుగదు. అహింసయనఁగా సాధ్యమయినంతవఱకుఁ దెలిసి జీవకోటికి హింస గావింపకుండుటగాని వేఱుగాదు. అట్లు కాదేని యీ ప్రపంచమునఁ బంచసూనంబున జీవహింసచేయని గృహంబొండు లేదు. మన నేత్రంబులకు గోచరంబులుగాని చిన్న జంతువులు మనకుఁ బ్రాణాధారంబులగు వాయుజలంబులతోఁ గలిసి లోనికింబోయి జఠరానలంబున మ్రంది జీర్ణములగుచున్నవి. ఈ యర్థంబునకు ధర్మవ్యాధుఁడు కౌశికునితోఁ జెప్పిన హింసాహింసాస్వరూపనిర్ణయంబె తార్కాణము.

చ॥ సలిలము లుర్వియాకసము సర్వము జంతుమయంబు గావునన్
గలుగు నవశ్యమున్సకల కర్మములందును హింస హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమై నటులుండు నింతయుం
దలఁపక హింసచేయమని తాము చరింతురు కొందఱిమ్మహిన్.

ఇట్టి హింసచేయక దేహయాత్రయైన జరుగునా? హింసయనఁ గారణములేకయే జంతువునకు బుద్ధిపూర్వకముగాఁ జేయు బాధయేకాని, తగిన హేతువున్నయెడ దుష్టజంతువులకును దుష్టమానవులకును శిక్షారూపమునఁజేయు హింసయు భ్రమగొని ప్రమాదవశమున నొనరించు హింసయు మనసున కెఱుకలేకయె శరీరయాత్ర నడుచు నవసరంబున ననివార్యముగా సంభవించు హింసయుఁగాదు.

గీ॥ హింస సేయనివాఁడు లేఁడీజగమున
నొక్కఁడైనను దమతమ యోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేగవలయు
నదియ మానె యహింస నా నతిశయిల్లు.



## 7. పరోపకారము.



ఒక యోధుఁడు సంగరంబున గాయపడి దుర్బలుఁడై తన యూరికిఁబోవుచు నధికాయాసంబున నడువలేక కుంటికుంటి వచ్చుచు మార్గమధ్యమునన్నున్న యొక ధర్మసత్రములోఁ బ్రవేశించి యక్కడఁ గటికినేలఁ బరుండి యట్టిటు కొట్టుకొనుచు నమితపరిదేవనపడుచుండెను. ఇట్లుండ నొకనాఁడాపల్లె నివసించు గర్భదరిద్రుని కూఁతురా దారినిబోవుచు వాని మూలుగు విని యంతరంగమున జాలిపడి తద్భట నికటంబునకువచ్చి వాని

యవస్థంజూచి యాదరించి తన యొద్దనున్న రెండుడబ్బులాతని యాహారపదార్థములకై యిచ్చి నాఁడుమొదలుగాఁ బ్రతి దినము రెండుడబ్బులు తెచ్చి యిచ్చుచుండెను. ఇట్లు కొన్ని దివసములు గడచినవెనుక నా జోదు తొంటిభంగి నరుదెంచిన యా కన్నెంగని "అమ్మా! నీ జననీజనకులు బీదవారని నేను వింటిని. నీవు నాకిచ్చు రాగినాణెము లెట్లిచ్చుటనుండి తెచ్చి తివో చెప్పుము. అన్యాయముగాఁ బరులఁ గన్నుఁగప్పి సంగ్రహించి యిచ్చిన ద్రవ్యంబుతోఁ బొట్టపోసికొనుటకంటె క్షుద్బాధచేఁ బ్రాణమువిడుచుటయే మేలు" అని కన్నీరొలుక దీనానవంబుతో నడుగ నా చిన్నది, ఓయీ! నీవీవిషయమునఁ గొంక నక్కఱలేదు. నా యిచ్చునది కాయక్లేశపడి సంపాదించినది గాని, యక్రమార్జితముగాదు. నిత్యము నేనిచ్చోటికి దాపుననుండు పొరుగూరి పాఠశాలకుఁ జదువుకొనఁబోవుచుందును. నేఁ బోవు దారిచేరువ నొక రేఁగుతోఁట గలదు. నిర్దిష్టసమయంబునకుఁ గొంత ముందుగా నిల్లువెడలి యా యారామములోని బదరీఫలంబులఁ గోసికొనిపోయి యా పండ్లను దోఁడి పిల్లలకు విక్రయించి యా డబ్బులుతెచ్చి నీ కిచ్చుచుందును. ఈ యుదంతము నా తలిదండ్రు లెఱుంగుదురు. "లోకములో మనకంటెఁ బేదలుందురుగావున నట్టివారికి మన శక్తి కొలఁది సాయపడుటయే శాశ్వతఫల ప్రదం"బని నా మాతాపితలు చెప్పు నీతియందు విశ్వాసముగల నేనిట్లు చేయుచుంటిని గాని వేఱుగాదని చెప్పెను. అంత నా సైనికుఁ డత్యద్భుతపడి నయనంబుల నానందాశ్రువులురాల నా బాలికాతిలకంబు మొగంబు వంకఁజూచి తల్లీ! పరోపకారబుద్ధిగలిగి దీనరక్షణ తత్పరురాలవైన నీవును, నీ మాతాపితలును జిరకాలంబు సద్య

శస్త్రాస్త్రాఖ్యంబుల వర్ధిల్లుదురుగాత మని దీవించి యా బాలనింటి కనిపె.

ఇట్లుండ మఱుసటినాఁడొక యశ్వారూఢుండగు గొప్ప వాఁడాదారినివచ్చి తన తురగంబు పిపాసదీర్చుటకై యా చావడియొద్ద దిగి గుఱ్ఱంబునకు నీరువెట్టి కట్టిపెట్టి లోనికిఁజని యందున్న యా వ్రణపీడితునింగని గుఱుతువట్టి సమీపించి పలుకరించి యాతనివలన సర్వవృత్తాంతము నెఱింగి యచ్చెరు వొంది నిన్నెన్నఁడు నెఱుఁగని పసిబిడ్డయే నీకింత యుపకృతిచేసి నయెడ నాకు బహుకాలము సేనలో నను వర్తనుఁడవయియున్న నీకు నేనెంత యుపకారకుఁడఁ గావలయునని పలికి యా సత్త్ర లేఖకుం బిలిచి యా భటుఁడు వ్యాధి కుదిరి దేహస్వాస్థ్యము గలుగునంతవఱకు. గావలసిన ధనమిచ్చి సమస్తోపచారములు జరుపుటకయి యేర్పాటుచేసి యాతనివలన నా రిక్తబాలిక యా వాసంబు మార్గంబు తెలిసికొని తిన్నగ నందుల కరిగి యా బాలంబిలిచి "అమ్మాయీ! నీ పరోపకారపారీణతకు నెంతయు సంతసించితిని. ఆ దిక్కుమాలిన బంటునకు నీవు చేసిన యుప కారంబుఫలము వేయిజన్మంబులకుఁ జాలును. నీ యప్పుదీర్ప నాతఁడుగాని నేనుగాని సమర్థులముగాము" అని స్తుతించి కృత జ్ఞతం జూపి యొక బంగారునాణెముల సంచిని జేతికిచ్చెను. అంత నాపిల్లజనకులు, "అయ్యా! మా యుపకారంబునకు మేమింతసొమ్ము గ్రహింప నర్హులముగాము" అని మరల నొసంగ యత్నించుచుండ నతఁడు దోసిలియొగ్గి మీ పుత్రికకిది యొక ప్రత్యుపకారముగాదు, ఆమెకుఁ దగిన బహుమానమీయ నేనెంతవాఁడను. ఆ దయామయుఁడగు సర్వేశ్వరుఁడీమెకు సర్వ

సంపదలిచ్చి చిరాయువొసంగి మనుచుగాకయని యాశీర్వదించి వెడలిపోయెను.

పరోపకారంబునఁ గలిమిలేములతోఁ బనిలేదు. దయ యున్నచో నున్నంతలోనే నిరుపేదలకు సాయముచేయ వచ్చు నని మనకీకథ బోధించుచున్నది.



## 8. సత్యము.



సత్యము సర్వశ్రేయస్సులకు మూలము. ఇదియే సర్వ దానములు. ఇదియే తపస్సు. ఇదియే నిత్యజ్ఞానబోధకము. దీని శక్తియు దీనివలని ప్రయోజనంబులు నిట్టివని వాక్రువ్వఁ జాలము. నిజము వల్కు పేదయైనను, దబ్బఱలాడి పరులఁ గన్నొఱఁగు ధనవంతునికంటె వేయిరెట్లధికముగా విశ్వసనీయుఁ డగుటకు సందియములేదు. ఒక్క యసత్యమాడి దాని స్థిర పఱుప నెన్నియో యసత్యములాడి కుమార్గములంబడి కడ గండ్లు గుడువవలసియుండును. అట్లయిన దాని నమ్మింప శక్య మగునా? తత్కాలమున కొకవేళ నమ్మించిన, ముందైన యథా ర్థము తేలకుండునా? అపుడైన దానిఫల మనుభవింపక తీఱునా? ఇంత యేల? నిజాపరాధంబు నివేదించి సత్యముచెప్పి తనకై యితరులచేఁగూడ నన్నృతమాడింపక రాజమార్గమునఁ బోయిన వాని కపుడకాదు మఱెన్నటికి నపాయమురాదు సరికదా? యట్టివాని నెల్లరు విశ్వసింతురు. ఆత్మకార్యరక్షణమునకై యొకానొకప్పు డసత్యమాడినఁగాని వలనుపడదని కొందఱు తలంచెదరుగాని, యది వట్టి మొఱకుఁదనము. కొండొక సమ

యంబున నట్లు కార్యసిద్ధియైనను దన యసత్యోద్యమంబు జగ మెఱింగినపిదపఁ దాదృశకార్యంబులు వేనవేలు చెడును. దాన నైహికాముష్మికదూరుఁడగుటయే కాదు. తన మనుగడలో లోకంబున నప్పఁతాతికైన మాఱఁడు. వేయి పుణ్యకార్యంబులైన నొక్క సత్యముతో సరిగావు.

చ॥ నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొక బావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వదిమేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్.

నేనందఱిం గనుమూయ వలంతిని. నా బూటకంబు దాఁటువాఁడొక్కండు లేఁడు. అని బొంకులాడి పరులకపకృతులు సేయుచు వేఱిడితనంబు చూపువానికంటె వెంబరపిత్తు వేఱొకండు లేఁడు. అసత్యము తానాశ్రయించినవానిని మద్యంబు పోల్కి మత్తునిఁ జేసి తెలియకుండ సర్వానర్థరోగంబులఁ గల్పించుచుఁ దన పట్టు వదలినపిదప జీవచ్ఛవంబుగాఁ జేయును. సత్యమో యట్లుకాక, యమృతంబు మాడ్కిఁ దేజోబలవంతునిఁగాఁ జేయును. ఒక గృహయజమానుఁడును, వాని యిల్లుసొచ్చిన నొక తస్కరుండు నొకని నొకఁ డెఱుఁగకపోయిన నొకద్వారంబునుండి యెట్లు నిశ్శంకసాశంకములుగా వెలువడుదురో యట్లే యభేష్ట రహస్య సంచారములుగల సత్యాసత్యంబు లొక్కనోటినుండి నిర్భయ సభయములుగా బయల్పడును. అనృతమువల్క నూహించు వానికిఁ దుదకు నాలుక తడఁబడ నొకటి చెప్పఁబోయిన నింకొకటి వచ్చును. సత్యమునకట్టి యాతంకము లేదుగదా?

ఎల్లలగ్గుల కగ్గమై సిరులొసంగు సూనృతంబు విడిచి సిగ్గుల వెగ్గలించి సడిపాలుచేయు ఘోరాసత్యమునకుఁ బాటు

వడుట "పాలు పరిత్యజించి విషము త్రాగుటగాదే?" ఎంతటి యసత్యవాదియుఁ దాను జెప్పినదెల్ల లోకులు సత్యమని తలంప వలయుననియే కోరునుగాని, తానసత్యము చెప్పుచున్నాఁడనని చెప్పుకొనుటకుఁగాని, జనులట్లు తలంపవలయుననికాని యిచ్ఛిం పఁడుగదా? సత్యముగానిదానిని సహిత మితరులు సత్యమని తలంచుటచేతనే యెంతో లాభమని యెన్నుచుండఁగాఁ దాను నిక్కముగా సూనృతమే పలికిన నంతకంటె విశేషలాభము గలుగుననియేకదా నిశ్చయింపవలసియున్నది? గోఘృతకుంభం బున నొక్క విషబిందువు పడి యా యాజ్యమంతయు విషతు ల్యముగాఁ జేయునట్లు సత్యసహస్రపూరితమగు నోట నొక యసత్యవాక్యము పడి వాని నెల్ల నాత్మసదృశములుగా నొన రించును. స్వల్పఫలం బపేక్షించి సత్యనిర్మూలనం బొనరించు వాఁడు చేతికఱ్ఱకై స్వాశ్రయశాఖను ఛేదించు జడుండుగాఁడె? అనృతంబునఁ బ్రయోజనంబుగలదని యుద్యుక్తుండగువాఁడు మరుమరీచికలంగని పయఃపానంబునకై పఱువెత్తు వెంగలి గాఁడె? అప్రయత్నసాధ్యంబు నుత్తమంబునగు సత్యముం బరిత్య జించి కష్టసాధ్యంబు నీచంబునగు నసత్యమునకుఁ బాల్పడుట సిద్ధాన్నముం బరిహరించి భిక్షాటనంబు సలుపుటగాదె? మన వారు దమ మాటలలో ననిశంబును మెలఁగుచుఁ జిరకాలము నుండి, తమ్మాశ్రయించికొనియున్న యతథ్యముపైఁగల ప్రేమా తిశయంబునఁ బ్రాణమైన విడువఁజాలుదురుగాని ప్రాణపదమ యిన యసత్యమును మాత్రము విడిచి నిమిషమయిన మనఁ జాలరు. "తాఁ జెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచిన"దన్నట్లు తాము పాడగుట యేకాక తమ బిడ్డలకు నయితము దాని నుగ్గుపాల తోఁ బెట్టి వారింగూడఁ బాడుచేయుచున్నారు. ఇందులకు

నిదర్శనముగా నొక బాలుని తలిదండ్రులు దాపునకుఁ బోయినఁ జేయికాలునని చెప్పుటకు మారుగాఁ జేరఁజేరి తమ పాపనికి దీపమును జూపి "నాయనా! యిది జేజె. దీనికిఁ బ్రతిదినము దండము పెట్టుచుండు"మని కఱపుచుందురు. ఆ కఱపులు విని యా మాణవకుఁడు దినదినము దివ్వెసరసకుఁ జనుచుఁ జేతులు జోడించి జోత సేయఁబోయి యెప్పుడో యొకప్పుడు చేతులు కాల్చుకొనును. ఆ వేఁడివేల్పును, గరుణలేక మ్రొక్కవచ్చిన యచ్చిఱుతవాని కరములనే కరమెరియించును. ఎక్కడనైన నింటిదీపమని ముద్దుపెట్టికొన్న మూతి కాలకుండునా? నోరెఱుఁగని పసివానికట్టి యాయాసమును దెచ్చిపెట్టఁ గారణభూతులు కల్లలకుఁ బుట్టినిండ్లయిన యాతని జననీజనకులేకదా? పరిహాసమునకైన నసత్యమాడుట పాపహేతువన నంతరంగమున మోసము దలంచి యనృతము పల్కుట ప్రాణహానియుఁ గూడ నాపాదించుననిన నాశ్చర్యమేమి? ఇందునకు నిదర్శనముగా నొక కథ గలదు.

రుమణ్వతియను నదీతీరంబునఁ బౌండ్రవర్ధనమను నొక గ్రామము గలదు. దానికి సమీపంబున నొక మఠంబుండు. దాన నొక సన్యాసి శిష్యులకుఁ బాఠంబులు సెప్పుచుఁ బ్రతిదిన మాయూర మానవ్రతంబున భిక్షాటనంబు సలిపి కొన్ని తండులంబులు సేకరించుకొనివచ్చి స్వయంపాక మొనరించుకొని కాలక్షేపముసేయుచుండు. ఇట్లుండి యొకనాఁడా పరివ్రాజకుండు నిత్యవృత్తికై యాపల్లెఁ దిరుగుచు ధనికుండగు నొక వైశ్యుని గృహముసొచ్చి నిలువంబడి తనకు బియ్యముపెట్టునకోఁ్కమటి యావనవతియగు కన్యంగాంచి కామపరవశుండై యామె తండ్రి వినుచుండ "ఆహా యేమి దైవప్రాతికూల్యము"

అని నుడివి మరలిపోయెను. ఆ కోమటి యా వచనంబు విని "యెన్నఁడుఁ పల్లెత్తని యీ భిక్షువు నేఁడిటనుటకుఁ గతంబేమి" యని చింతించి మఱునాఁడు యథాపూర్వముగా వచ్చిన యా ముండింగని "మహాత్మా! నిన్న మీరట్లు పలుకఁ గతంబేమి" యని యడుగ నా యతి "యోయీ! నీ యైశ్వర్యముచూచి నేను సంతసపడుచుందునుగాని, నీ పుత్రిక భ్రూమధ్యగతంబయిన పుట్టుమచ్చ నీ కుటుంబంబున కనర్థహేతువు కానున్న" దని వచించె. అంత నా బేహారియు భయపడి యా స్వామి వాక్యము వేదవాక్యముగా నెంచి పుణ్యాత్మా! దీనికిఁ బరిహారంబు వచింపుమని ప్రార్థింప నా మాయావి యీ సాయంకాలమున దీని నొక పెట్టెలోఁబెట్టి నదిలో విడిచిపెట్టుమని చెప్పి తామఠంబున కరుదెంచి స్వాంతేవాసులతో "మీరీ సూర్యాస్తమయ సమయంబున నీ యేటివాలుననుండు మఱ్ఱిచెట్టుచెంతకుఁజేరి యా తరంగిణిని గట్టుదరిని గొట్టుకొనివచ్చు పెట్టెం జేరఁదీసికొని రండని నియోగించి తదేకధ్యానరతుండైయుండె. ఆ మూర్ఖవైశ్యుండును ప్రేమపాశంబు తెగఁగోసి తదుక్తప్రకారము గావింప నంతకుముందు యా యేటియొడ్డుననుండు వనంబున వేట సలుపు నొక రాజపుత్త్రుం డార్తధ్వనితోవచ్చు పేటికంగని పరిచరులచేఁ దీయించి యందలి కన్నెనుజూచి వెఱపుడిపి యాశ్వాసించి యామెవలన యావద్వృత్తాంతము నెఱింగి దానఁ దానది వఱకుఁ బట్టిన యెలుఁగుబంటిని జొనిపి ప్రవాహంబున విడిపించి యా కాంతంగొని నిజమందిరంబునకరిగె. ఆ పరివ్రాజకచ్ఛాత్త్రులును వటవృక్షంబుకడ వేచియుండి యెట్టకేలకాయేటఁ గొట్టుకొనివచ్చు నా పెట్టెం బట్టుకొని మోచుకొనిపోయి గురువు నెదుటఁబెట్టి యాతని యానచే నాఁడు వారు గ్రామంబున

శయనింపఁబోయిరి. ఆ యసత్యశీలుఁడగు వంచకుండు నా వేటిక నత్యాతురతతోఁ దెఱచి పైవచ్చు భల్లూకం బొడలెల్లఁ జీల్పఁ గాలధర్మంబునొందె. కావునఁ బరవంచనపరంబగు నసత్యము ప్రాణహానియు యశోహానియుఁగూడఁ గలిగించునని మనకీకథ బోధించుచున్నది.

కొందఱు మందబుద్ధులు తమకంటె నుచ్చదశయందున్న నరుల యనుగ్రహసంపాదనమునకై కొంకక బొంకుదురు. కాని, దానివలన నందఱకును బెద్దయగు జగదీశ్వరుని యాగ్రహంబునకు భాజనంబగుట దలంపరు. మ్రుక్కడియగు నొక్క మానవుని కోపమునకు వెఱచి యథార్థము నడఁచుట భగవదాజ్ఞను మీఱి యాతని నధఃకరించుటగాదే? కొందఱితరసమయంబుల సత్యము దప్పకుండియుఁ గష్టకాలములఁ దమ్మును దమ సత్యమునుగూడ మఱచెదరు. ఎంత యాపదలైన నసత్యమునకుం జొరకుండుటయె కదా నిక్కంపు సత్యసంధతకు గుఱుతు.

తొల్లి హరిశ్చంద్రుఁడు కడునిడుమలు తొడరియు నన్నృత మాడుట కొడఁబడమినిగాదె సత్యహరిశ్చంద్రుఁడని పేరువడసి పెద్దకాలంబు క్రిందటనె మడిసియు నేఁడును మృతజీవుండుగా నుండె. సకల జనాహ్లాదుండగు ప్రహ్లాదుండు పుత్ర మరణంబున కైన నొప్పుకొనెఁగాని యసత్యమాడ నొడంబడెనా? దానగుణ మూర్తియగు బలిచక్రవర్తి యసురయినఁగోల్పోయెఁగాని సత్య ప్రతిజ్ఞాభంగంబు గావించెనా?

ఆ॥ బ్రతుకవచ్చుఁగాక బహు బంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాట తిరుగలేరు మానధనులు.

పుడమిపై నెందఱిట్టి భూపాలురు పుట్టి గిట్టరు? వారెల్లరకిట్టి సుస్థిరసత్యయశఃఫలంబు చేకూఱెనే? సత్యసంధున కఖిలశుభంబులు కరతలామలకంబైయుండు. అనృతరతునికృత్యంబు భస్మపతితాజ్యంబుఁబోలి నిష్ఫలంబగును. అనృతపరునకు సరివారిలో నగౌరవమును నూట బోటగుటచే నవిశ్వాసమును దాన బహుజనద్వేషమును, దాన నపకీర్తియు సంభవించును. కావున మన మీశ్వరుఁ డొసంగిన బుద్ధి నుపయోగించి సత్యమార్గమున సంచరింపఁ బ్రయత్నింపవలయు.

చ॥ కుదురు సమస్త ధర్మములకున్ విను సత్యము యోగమోక్ష స
త్పదములు సత్యకార్యములు పాప మసత్యముకంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు తొమ్మిది నూఱులు వెండినూఱునై
యొదవిన నీడుగావు భరతోత్తమ! సత్యముతోడ నారయన్.



# 9. జయపురరాజ్యము.



జయపురరాజ్యము రాజపుత్రసంస్థానములలోనెల్ల జనబాహుళ్యముగలదియు సారవంతమయినదియుఁగా నున్నది. ఇందు ముప్పదిలక్షుల కెక్కువ జనసంఖ్యగలదు. వీరిలో నేఁబదివేలకెక్కువగా జైనమతస్థులు. జైనులు బౌద్ధులవలెనే యీశ్వరసద్భావము నంగీకరింపరు. భూతదయ జైనుల ధర్మములలో మొదటిది. అందుచే వారు మాంసభక్షణముచేయరు. జాగీరులకుఁ బోవునదిగాక యీ రాజ్యమున నఱువదిలక్షుల రూప్యములకుఁబైగ నాదాయమువచ్చును. ఇందలి జాగీరులు గలవారి కందఱికిని గలిసి డెబ్బదిలక్షుల రూప్యములకు నధికముగాఁ బ్రతి

సంవత్సర మాదాయము రాఁగలదు. ఈ దేశంబున శంబర సరోవరము గలదు. ఇందుఁ బ్రవహించు వాహినులలో బానస నది గొప్పది. వనగంగయను నొక తరంగిణి పూర్వముఖముగాఁ బ్రవహించి యమునానదిలో సంగమించుచున్నది. ఈ విలాతిని ధాన్యము, చెఱకు, ప్రత్తి, నల్లమందు, నువ్వులు, పొగాకు మొదలగునవి పండును. పాలరాలు మలచుట, పింగాణులు చేయుట, సన్నబట్టలు నేయుట లొంటి యట్లు చేతిపనులధిక ముగా జరగును.

రాజపుత్రస్థానములలోనెల్ల నీ దేశమునందు విద్యాభి వృద్ధి యెక్కువగానున్నది. నలువదియైదు దొరతనమువారి పాఠ శాలలును, నన్నూటపది యన్యపాఠశాలలును గలవు. స్త్రీవిద్యా వృద్ధికై యీ దేశమునఁ బదివేల రూప్యములకంటె నధికముగా వ్యయపెట్టఁబడును. మొట్టమొదట హూణశకము తొమ్మిది వందల యఱువదియేడవ సంవత్సరమున "ఢోలరావు" అను రాజపుత్రుఁడు చిన్నచిన్న రాజుల గెలిచి యీ సంస్థానమును స్థాపించెనఁట. అంబపురమీ దేశమునకుఁ బూర్వపు రాజధాని. ఇప్పటి రాజధాని జయపురము. జయసింహమహారాజు 1728-వ సంవత్సరమునఁ దనపేర జయపురము కట్టించి దానిని రాజధాని నిగాఁ జేసికొనెను. అతఁడు జ్యోతిశ్శాస్త్రమునం దభిమానము గలవాఁడయి ఢిల్లీయందును, గాశీపురమందును, మధురాపుర మందును, ఉజ్జయినీనగరిని నక్షత్రశాలలు గట్టించెను. ఆ శతాబ్దాంతమున దేశములోని యంతశ్ఛిద్రములచేతను, మహా రాష్ట్రుల దాడిచేతను రాజ్యము మిగుల హీనదశయందుండెను. 1857-లో నుత్తరహిందూస్థానమున సైనికులు హూణులపైఁ దిరుగఁబడి నపుడప్పటి మహారాజయిన శివాయి రామసిం

గింగ్లీషువారికి సహాయుఁడుగా నుండినందున నింగ్లీషుదొరతనము వారాయనకు గౌరవచిహ్నముగా నిరువదియొక్క పిరంగులు కాల్చుట కేర్పాటుచేసిరి. ఆ రాజన్యుఁడు 1880-వ యేట మృతి నొంద నాతని దత్తపుత్త్రుఁడగు నిప్పటి మహారాజుగారు సింహాసనమునకు వచ్చిరి. ఈయనపేరు శివాయి మాధవసింగుగారు. ఈ భూవరుఁడు 1890 సంవత్సరమునఁ దమరాజ్యము దర్శింప వచ్చిన రాజప్రతినిధియగు లాండ్సుడౌన్ ప్రభువుపేరు పెట్టి తన రాజధానియందొక గొప్ప వైద్యశాలం గట్టించె. ఈ జయపురము భరతఖండమునఁగల నెల్లపురములలో మిక్కిలి చక్కనిదై విశాలములై శిలామయంబులగు వీధులతో మనోహరముగా నుండును. ఎల్ల రథ్యలలో రాత్రులయందు వాయుదీపములు వెలిఁగింపఁబడును. ఈ పట్టణంబు నలుదెసల ఱాతికుడ్యము గలదు. మహారాజమర్గము పురమధ్యభాగంబు నలంకరించు. ఈ ధరావరుని శాస్త్రపాఠశాలలో షట్ఛతాధిక విద్యార్థులు చదువుచుందురు. ఈ పుటభేదనంబున శిల్పవిద్యాశాలయుఁ జిత్రవస్తుప్రదర్శనశాలయు మేయో ధర్మవైద్యశాలయుఁ గలవు. ఇప్పురిలోని రామనివాసారామము హిందూదేశములోని సకలోద్యానంబులకంటె నధిక రమ్యమయినది. ఈ నగరికిఁ గ్రోశద్వయదూరంబుననున్న యొక నదినుండి యావిరియంత్ర సాహాయ్యంబున గొట్టములలోనుండి నిర్మలోదకము పురంబునకుఁ దేఁబడు. భరతఖండనివాసులలో నెల్ల రాజపుత్త్రులు ధైర్యశౌర్యసాహసంబులఁ బ్రసిద్ధిఁ జెందినవారు. ఈ శౌర్య మొక్క పురుషులలోనే కాక, తద్వంశవనితలయందుఁగూడఁ గన్పట్టుచున్నది.

ఢిల్లీనగరమునం దౌరంగజేబు మొగలాయి పాదుషా కాక మున్ను కొంత కలహము నడచెను. అక్కాలంబున జస్వంత

సింగు జయపురమహారాజుగానుండె. ఆతని ధర్మపత్ని, యుదయపురమహారాజు ప్రియపుత్రి. జస్వంతసింగునకు మొగలాయి సైన్యముతో ఘోరసంగ్రామము తటస్థించె. ఆ సంగరంబున రాజపుత్రులు నిరుపమానవీర్యముసూపి ప్రాణాశలేక పోరాడిరి. ఆ మహారణములో మహమ్మదీయసేనలెల్ల దిక్కులం జుట్టుముట్టి క్రూరయుద్ధముచేయ సూర్యాస్తమయసమయంబునకు దశసహస్రరాజపుత్రభటులు రణరంగమునకు బలియయి వీరశయనము నొందిరి. జస్వంతసింగతిధైర్యసాహసములతో శక్తికొలంది పోరాడియుం బ్రయోజనంబుగానక సాయంసమయమున శేషించిన యేనూఱుయోధులతో యుద్ధపరాఙ్ముఖుఁడయి స్వపురంబువంక మరలెను అతఁడు పలాయితుఁడై వచ్చుచున్నాఁడనువార్త శ్రోత్రపథంబు తాఁకఁగానే యాతనిమహిషి భర్తకెదురేగి యాదరించి, కొనివచ్చుటకయి పరిచారకులఁబంపక యట్టి పౌరుషహీనుఁడగు పిఱికిపంద తనకు మగఁడుగా నుండఁదగఁడని వీరాలాపంబులు వల్కుచు భర్త లోపలకు రాకుండ భృత్యులచేఁ గోటకవాటములువేయించె. అతఁ డతిపరాక్రమంబున మహాహవముచేసి నిజసైన్యము రూపుమాయుటచే నిట్లు రానయ్యెనని యెఱిఁగినదయ్యు నిర్దయురాలై తాద్ృశరణభీరుఁడు తనకుఁ బతియుఁ దన జనకునకు జామాతయుఁ గాఁజాలఁడని పలికి ప్రాణాధికమయిన మానమునే విడిచినయెడఁ బ్రాణమును విడిచినట్లేయని తనకుఁ జిఱిపేర్పుఁడని సేవకుల నాజ్ఞాపించెను.

రణవిముఖుఁడగు ప్రియుని మొగము గననొల్లక యిట్టి దశలో నామె యేడెనిమిది దినములున్నపిదప జన్మగృహమునుండి యామె మాతవచ్చి తన యల్లుఁడు పరాజయదుఃఖముపోవఁ

బునస్సంగరంబు గావించి యరిసంహారము సేయ సేనలఁ గూర్చుకొనుటకై పురివంక మరలెనుగాని, శరీరరక్షణార్థముగాదని నమ్మఁబలుకునందాఁక రాజ్ఞి స్వస్థచిత్తురాలుగాలేదు. ఆహా యేమి యీ క్షత్రియాంగనా క్షాత్రము? కీర్తిగోరువారి పౌరుష మిట్లు కదా యుండవలెను? ఇట్టి మాతలకు సుతులగువారును, భార్యలకు భర్తలగువారును వీరవ్రతము నెట్లు విడువఁగలరు? రాజపుత్రకులజుఁడై రణభీరువగువానిముఖము తల్లిగాని, ప్రేయసిగాని చూడనొల్లదు. పూర్వకాలమున నిట్టి వీరగుణము రాజభామినులలో మాత్రమేకాక, బ్రాహ్మణసీమంతినులలోఁగూడఁ గానఁబడుచున్నది. తిక్కనసోమయాజిజ్యేష్ఠపితృవ్యుని పుత్రుఁడగు ఖడ్గతిక్కన నెల్లూరు మండలంబునకు రాజగు మనుమసిద్ధిరాజు నొద్ద సేనానాయకుఁడుగానుండి కాటమరాజులతోడి యుద్ధమున నోడి యింటికిరాఁగా నాతనిభార్య యతఁడు స్నానమునకు వచ్చునపు డాఁడువారికినవలె మంచ మడ్డువెట్టి చాటున నీళ్లు పసుపు ముద్దయుఁ బెట్టి "యిదేమని భర్తయడిగి విచారింప" నామె "యింతవఱకు మనయింట మీ తల్లియు నేనును మాత్రమే యాఁడువారము. ఇపుడో—

క॥ "పగఱకు వెన్నిచ్చినచో, నగరే మన యాఱువేల నాయకులంగున్
ముగురాఁడు వారమైతిమి, పగపేటికి జలకమాడ వచ్చినచోటన్."

అని నిందించెనఁట. దానికి నోర్చి యోగిరం బారగింపఁ బోయిన తఱి నాతని తల్లి విఱిగినపాలుపోయుచు—

క॥ అసదృశనృప వీరులచేఁ, గసివోవఁగ విఱిగె నీ మగతనంబు మఱిన్
గసవును మేయఁగఁబోయి, పసులన్నియు విఱిగెఁ దిక్క! పాలున్విఱిగెన్.

అని యుపాలంభంబుసేయఁ గోపావిష్టుండయి యాక్షణం బయ

నికి నడిచి యందుఁ బలువురు జోదులం బరిమార్చి తానారణాం గణంబున దేహత్యాగముచేసెనని ప్రసిద్ధిగలదు.



## 10. నీతిచంద్రిక, విగ్రహము.



అనంతరమానరేంద్రనందనులమందానందకందళిత హృదయారవిందులయి విష్ణుశర్మంగని యిట్లనిరి. "దేవా! తావకంబగు సేవావిశేషంబున నిరవశేషంబుగ మిత్రభేదమును వినంగని మనంబున ఘనంబగు మోదంబునొందితిమి. ఇంక విగ్రహంబుం గూడ ననుగ్రహించి మమ్ముఁ గృతార్థులంజేయ వేఁడెదము. వేగరమీనవకథాసుధారసంబు వెల్లిగొలిపి యాఁకొన్న మా వీనులకు విందుసేయుండు." అనిన నా యవనీసురసత్తముండాదరాయత్తచిత్తుండయి యిట్లు వినిపింపందొడంగె.

తొల్లి తుల్యబలవిక్రమంబులగు మయూరమరాళంబులకు సమీకంబు చే కుటిలతటి నొక యరిష్టచ్చును నమ్మి యా హంసమ్ము పరాజయమ్మునొందె. మీకక్కథ వక్కాణించెద; చక్కగా వినుండి. కర్పూరద్వీపంబునఁ బద్మకేళియను కొలను గలదు. అందు హిరణ్యగర్భుండను మానసౌకస్స్వామి వాసముచేయుచుండు. అందలి జలవిహంగమంబులా యంచలరాయనిం దమ కందఱకు దొరగాఁజేసికొని, వాసిగని యుండును. ఆ పరమహంసావతంసుండాశల జయించి నైజతేజం బెల్లయెడల వెలుంగ నొక్కనాఁడు సూర్యుండు పూర్వ పర్వతశృంగం బలంకరించిన యనంతరంబనిజాప్తద్విజనికరపరివేష్టితుండయి రాజయోగంబు మెఱయఁ బుండరీకాసనంబున సుఖాసీనుండయి నిండుకొలు

వుండఁ గతిపయమాసంబులకుమున్ను దేశాంతరంబరిగి మరలి యేతెంచిన దీర్ఘముఖుండను బక ముఖ్యుండు వాకిట నిలిచి, ప్రతీహారులవలనఁ దనరాక యెఱిఁగించి పుచ్చి సముచితప్రకారంబునఁ గొలువుసొచ్చి వినయవినమితగాత్రుండయి దండప్రణామంబుగావించినరాజును సాదరాహ్లాదమేదురనిరీక్షణంబుల నాతని వీక్షించి "రమ్ము కూర్చుండు"మని చేయిచూపి దాపునఁ గూరుచున్న యతని కిట్లనియె. "ఓయీ! దీర్ఘముఖా! నేమమా నీకు? బహుకాలంబునకు నేఁడు నీ జాడఁ జూడఁగంటిమి. విదేశవాసాయాసక్లేశంబున భృశంబును జెన్నుఁదఱిగినట్లున్న వాఁడవు. ఇంత తడవు నేయే దేశమ్ములఁ గ్రుమ్మరుచుంటివి? ఏయే సీమల నేయే విచిత్రంబులు నేత్రంబుల కపూర్వాపర్వంబు లొనరించె? ఎక్కడను మిక్కిలి యక్కజంబులు లేవుగా? నీ మోము పోలికను వదిలకింప నెప్పట్టుననో యొక గొప్ప విశేషంబున్నట్టు పొడగట్టుచున్నది. నీ వేగినచోట విశేషంబు లేల పుట్టకపోవును? సరగ నెఱిఁగింపుమా; వినదము" అనిన తేని మొగంబున న దృష్టి వఱపి యాతం డిట్లనియె.

ఏలికపాలనంబు సేయు నేల నేమూలం, గుశలం బణుమాత్రంబును గుంటువడదన సార్వకాలము దేవరపాదము లాశ్రయించి సన్నిధానంబునన మెలంగు నస్మదాదులను నేమమాయని వేఱ యడుగనేల? ఇఁక దేశాంతరమునందున్ననాఁటి నా కుశలమో శశవిషాణప్రరోహంబు. అది యంతయు దేవరకీ తనుద్యుతియే తెలుపుచున్నది. అది యుండనిండు. నాఁడట్లు స్వామిపాదంబుల యీ దేశంబుగొని చనిన దాదిగా నీ యా దేశంబన నేల? అశేషాశావకాశమ్ములు గ్రుమ్మరి క్రమ్మఱి భాగ్యవశమ్మున సమ్ముఖమ్ము సేరఁగంటిని. అంతరాంతరంబుల నేనెడ

నెడఁగాంచిన వింతలసంఖ్యాతంబులు గలవు. అవి యన్నియు నెన్న నేండ్లును బూండ్లునుంబట్టు. నిలుకడమీఁద విన్నపంబు చేసికొనియెద. త్రోవను సేవకుండొక్క యపరాధంబు గావించుకొని వచ్చినవాఁడు. ముహూర్తమాత్రంబు మార్గఖేదం బపనయించి యామూలాగ్రంబుగఁ గార్యనివేదనం బొనరించెదు. దేవర దివ్యచిత్తంబున లెస్సగా నవధరింపవలయు. అని యరమోడ్పుఁ గన్నులతో వేఁడి నిట్టూర్పు నిగిడించి క్షణ మూరకుండి యల్లన నిట్లనియె.

జంబూద్వీపంబున వింధ్యంబను ధరాధరంబు గలదు. ఆ గిరివరశిఖరంబున గహనవిహగంబులకెల్ల వల్లభుండయి చిత్రవర్ణుండను శిఖావలతల్లజుండు కాఁపురముండును. తదంతికాంత కాంతారంబున నతని యనుజీవులగు ఖగంబులు కొన్ని నన్ను బహుయోజనాధ్వగామింగాంచి యాతిథేయసత్కారంబు లాచరించి యమృతకల్పంబులగు పరిపక్వఫలంబు లొసంగి మెసంగి విశ్రమించియున్న నన్నుంజూచి కుశలప్రశ్నపూర్వకంబుగా నిట్లనియె. ఓ బకోత్తమా! "యేదేశంబు భవజ్జననంబునకుఁ దావలంబై పుణ్యంబు వహించినది? ఏయేదేశములను నీ వియోగ వ్యథపాలుచేయుచువచ్చి యిపుడీదేశము నలంకరింపుచున్నాఁడవు? ఇంకను నీ పాదము లేదేశమును బవిత్రము గావింపనున్నవి? ధర్మపరిపాలనంబుగ్రాల మీ నేల నేలుచు నీబోటి శుచిమూర్తుల సేవకులనుగాఁ బడయునంతటి భాగ్యము వహించి సత్పురుషశిరోమణి యనిపించుకొనుచు మీ రాజ్యము నలంకరించుచున్న రాజరత్నమెవఁడు? మా యందఱి కర్ణంబులు భవదీయవృత్తాంత శ్రవణ కుతూహలాధీనంబులయి వేఁచియున్న యవి. ప్రయాణత్వర యొక్కింత గుదియింప వలనుపడునేని

నిమిషమాత్రం బిందునిలిచి నీ యుదంతంబు సాంతంబుగా వాని కిం బ్రసాదింపుము.” నావుడు నేనిట్లు వాక్రుచ్చితిని.

కర్పూరద్వీపమన మును వినియుందురేకదా? నేనాదీవికి దేవరయగు హిరణ్యగర్భుండను చక్రాంగపుంగవుని యనుంగు భృత్యుఁడను. మా రాజు బలపరాక్రమాదులాబాలప్రసిద్ధంబులు. కాన నాతండొకవేళ మీకు శ్రుతపూర్వుండై యుండనోపు. అందఱు నన్ను దీర్ఘముఖుండందురు. ఆజాలపాదనాయకుండు నన్నుఁ బ్రాణంబు ప్రాణంబుగా మన్నింప సన్నిధానవర్తినై మెలఁగుచుందును. అట్లు సుఖైకభాజనంబనై యుండి యొక్కనాఁడశేషవిషయంబులంగల విశేషవిషయంబుల నీక్షింప నపేక్షవొడమ మా యొడయని వీడ్కోలువడసి యాపుడమి వెడలి యొండనొక వాననొక దేశమ్ములుగాని దేశమ్ములెల్ల సంచరించి తత్తద్విశేషంబులకు డెందంబున నానందించుచు వచ్చివచ్చి యదేపఁగ నేఁడీదీవియుఁ జొచ్చితి. ఇచ్చటి విశేషంబులెల్లఁ జూడ నా యుల్లంబు కడువేడుకపడుచున్నది. పక్షివరులారా! “యీ దినశేషంబు మీ సమక్షంబున నీ దీవి వినోదవీక్షావిహారంబునఁ గాలక్షేపంబుచేసి రాత్రియు మీతోడఁ గూడ నిష్టకథాగోష్ఠింగడపి యెల్లిప్రొద్దున మా సీమకేగెద.” అనవుడు నా విహంగంబులు ప్రహృష్టాంతరంగంబులయి యట్ల యగుంగాకయని గమనపరిశ్రాంతి కొంత శాంతిపొందినమీఁద నన్ను మున్నిడుకొనిపోయి యా ధాత్రింగలవిలోకనపాత్రంబులగు చిత్రంబులెల్ల నాకుం గ్రమంబునఁజూపి యాపిదప నన్ను మగుడఁ దమ మనికిపట్టునకుం దోకొనివచ్చి యచ్చేరువ నివ్వాలదవ్వుల నిలిపి లోని తమ ఱేనిం గానిపించి యిట్లనియె. ఓ యండజకులమండనా! “మీ భువనంబును మా భువనంబును

లెస్సగాఁ జూచితివిగదా? ఏది యీ దీవుల రెంటిలో నీ కంటికిం పును సొంపును మిగుల నింపుచున్నది? ఏవాఁడు మన ఱేఁడు లిద్దఱిలోఁ దద్దయుఁ బెద్దఱికంబు వహియించి మించు? అభిజనాభిమానంబును ననుమానంబును మాని నీ మానసంబునఁ గలయది తప్పక చెప్పుము." అనినఁ బ్రహాసభాసురముఖుండనయి నేనిట్లు పలికితి.

నెచ్చెలులారా! "మీరు కూర్మంబులవలె సదా యింటుండి దేశాంతరవృత్తంబులఁ గలనైనఁ గని విని యెఱుంగమింజేసి యీలాగున బేలతనంబునఁ బలుకుచున్నారు. మీ డెందంబులఁ గ్రందుకొన్న సందేహంబులఁ బాపికొన మిక్కిలి యక్కఱపడి యడిగితిరి కాన, మైత్రిం బురస్కరించి యున్నదియున్నట్టు వాక్రుచ్చెద ఆలింపుఁడు. నిజముగా మా దీవికి మీ దీవికి హస్తిమశకాంతరము గలదు. మాయావాసంబు జనశరణ్యభువనంబు. మీ నివాసము మహారణ్యము. ఇఁక రాజుల నడుగుదురేని మా ఱేనికి మీ ఱేనికిని, బర్వతంబునకుఁ బరమాణువునకుం గలవాసి. మా యధీశ్వరునికి నిలయము కేవలము పద్మాకరము. ఆహార మమృతము. అనుచరులు నిరంతరము నరసులసంగతినుండు కవికులంబులు. మా విభునివైభవము సమగ్రముగా నెన్న వేనోళ్లవాఁడును నేరఁడన మనమా యిఁక వాకొనఁగలవారము. పట్టిచూడ మీ దొరయందివియన్నియు విపరీతంబులయి యున్నయవి. నిలయంబు నట్టడవి. అశనమో కాయలు గడ్డలు. భృత్యులందు మా అనవరతమునకు జనుల సంగతిం దిరుగు పలుగాకి మూఁకలు. ముంజేతికంకణమున కద్దమేల? ఇట్టి మీ ప్రభువు వైభవంబు మీ యుల్లంబులకే తెల్లంబు. అది యటుండనిండు. మీరీశిఖి చెంతఁజేరి చెట్లగట్ల

నీకేల? బరితపింపనేల? కాయగసురు లేఱికొనితిని మననేల? మిమ్ముఁ గన్నప్పటినుండియు నా హృదయంబునకిదియ విచార మగుచున్నది. ఏమిసేయవచ్చు? ఇదియంతయు మిమ్మిట్లు పుట్టించిన దైవంబు దోషంబుగాని మీ దోషంబుగాదు. లోకములో సజ్జనులతోడి సఖిత్వంబు సంభాషణమాత్ర సిద్ధంబు కావున మీరిపుడు నాకుఁ బరమాప్తులయితిరి. సత్పురుషులైనవారు పరులకష్టంబులైనఁ జూచి సహింపఁజాలరన నాప్తుల యాపదలెట్లుచూచి సైపఁగలరు? ఈ దేహమును ధరించుటయుఁ బరోపకారార్థమేయగుటను మీకొక్క హితోపదేశంబుచేసెద. నా పలుకులు కుఱుచ సేయక చెవులం జొనుపుఁడు. బుద్ధిమంతులరు. మీకు విస్తరించి చెప్పఁ బనిలేదు. బాగుపడఁ గోరుదురేని కీడుమేలాడక నైశంబపయనంబయి రేపకడ నాతోఁ డఁగూడ మా నేలకు రండు. ఆకడ మీ కనన్యాపేక్షంబుగ జీవనము నడుచును. మా యొడయండును, సర్వజనసంస్తవనీయుండు, పరమకృపానిరతుండు, ఆశ్రితసులభుండు, మిమ్మందఱఁ దన పరివారంబులోనివారిఁగా మన్నించును. అతని పాలంబడి మీకుఁబోలిన లీలమేలుగఁ గాలంబచ్చటఁ బుచ్చవచ్చు. దీనికిం దగినయుత్తరం బంగీకారంబ. ఒండుతలఁపుదక్కి ప్రయాణంబై రండు. ఆడుచుం బాడుచుం బోవుదము.” అనిన రోగార్తులకుఁ బథ్యపదార్థంబులుంబోలె నా హితవచనంబులు రుషారోగపీడితంబులగు నా పక్షుల శ్రవణంబుల కసూయాజనకంబులయిన ముఖంబులఁ గోపంబులు ముడివడ శుష్కహాసితంబు తెచ్చుకొని కన్నుల మిడుఁగుఱులు రాల నన్నుఁ దూష్ణీంభావంబున నీక్షించుచు నా పక్షులెల్ల నోరికివచ్చినట్లు నన్నును దేవరను గొన్ని

నికృష్టవాక్యంబులాడెను. అవియెల్లనిండిన యోలగంబున నుగ్గడింపఁబోలవు. ఆ కుక్కలట్లు మొఱిగిన మాత్రంబున నేలినవారి గౌరవంబున కొక్క తక్కువయుఁ గలుగదు. అవి తమ నైజగుణంబులే వెడల నాడుకొన్నవి. పాములకుఁ బాలు వోయ విషవృద్ధియగునట్లు వివేకశూన్యులకు హితవాక్యం బులు గఱప దుర్మదంబెక్కును. సర్పంబుల కొక్క నోరనెకాని, ఖలులకు నిలువెల్లను విషంబేయని మనీషులు నుడువుదురు. కావున క్షుల్లకజనంబులకుఁ బాడి గఱపఁబోవుట నోరి చాపలంబు గాని వేఱుగాదు. అట్టి హితోపదేశంబువలనఁ జలంబు బలి యుంగాని, లవంబును గుణంబలవడదు. కాఁబట్టి బుద్ధిమంతుఁ డెల్లవిధంబుల వివేకి లోకంబునకే బోధింప యత్నపడవలయు. కాని నాఁడసితాననంబులకుఁ దెలుపఁబోయిన చెవులపోతురీతిని దప్పక ముప్పుఁజెందును. ఆ కథ యాకర్ణింపుఁడు.

మాల్యవంతంబుపొంతసంతతపరిణతఫలకలితతరుషండమం డితంబగు వనం బొండు గలదు. అచ్చటి గోలాంగూలజాలంబు మందు వేసవి నొక్క వాసరమధ్యంబున నెండుగఁ దృషార్దితంబై బయలువెడలి కడుదవ్వునఁ బొడఁగనవగు మృగతృష్ణాప్రవాహం బాలోకించి నదీప్రవాహంబని భ్రమియించి మించిన యెండ వేఁడిమి నడుగులొక్క మొగిఁ బొక్క మిక్కిలి దూరమునడిచి యెక్కడను నిక్కంపు వారి పూరంబు గాననేరక యూరక డస్సి యుస్సురనుచు నడుగామడగా నా చాయనున్న యొక్కన్య గ్రోధపాదపచ్ఛాయాశీతలంబగు సికతాతలంబున కల్లన నొడళ్లు సేర్చి జటాఝూటంబు లూఁతగాఁ గూరుచుండి యుండఁ గొండమ్రుచ్చొక్కటి తక్కటివానితో నిట్లనియె. "చూచితిరా? మలినముఖులారా! మన మిపుడెంతదూర మరుదెంచినారమో?

మనయావాసంబున కీవసుమతీజరాజంబు యోజనంబుండునని వినుచుందుము. ఎండతాఁకునం గడుబడలియు జలంబులాన నాననుతలంపున నదేయిదే కాసారంబు డాసెదమని యాసాసలందఱిమి నడచితిమి. నడచినకొలందిని జలంబులంతకంతకు దవ్వగుచున్నట్లు నా మదికిం గన్పట్టుచున్నవి. ఇప్పటిచొప్పు పరికింప నడుగుతీసి యడుగిడ జాడ పొడగానరాదు. మధ్యందినదిన కరాతపతైక్ష్ణ్యంబునఁ గాళులు కాలి చాల బొబ్బలెక్కినవి. నాలుక తడియాఱి పిడచవాఱుచున్నది. నేఁడీదప్పికెట్లు తప్పవారము? ఏమి సేయుదము?" అని మిగుల వగలం బొగులుచుండ నా వటకుటకోటరాభ్యంతరంబున వసియించు శశకంబొకండాదీనాలాపంబు లాలించి స్వాంతరంగంబు కరుణాతరంగితంబగుడు మనసుపట్టలేక విధిప్రేరణంబునఁ దొఱ్ఱవెడలి వచ్చి యఱుత నిలిచి కర్ణంబులు ఱిక్కించి యిట్లనియె. "ఓ బుద్ధిహీనులారా! మీరాయెండమావులంగని కాఁబోలు, నీటితావులని యాసపడుచున్నారు. అవి మరీచికలుగాని వీచికలు గావు. ఇదిగో—నా చేయిచాయం దిన్నగఁ జూడుఁడు అల్లదె—యాపల్లంబున ననతిదూరంబున వారిజాకరం బొకండు గలదు. అందఱిగి మీ పెందగఁ దీర్చికొండు పొండు" అన నొక యసితాననంబు ప్రహసితాననంబై కాలానలజ్వాలలీల మండిపడి పటపటఁ బండ్లుగీటుచుఁ గుటిలభ్రుకుటియయి చదలున నదరులు సెదరఁజూచుచు లేచి కప్పరపాటున నా కుందేటిమీఁదికిఁ గుప్పించి యుఱికి దాని కడకాళ్లు దనకేలఁ గీలించి పైకెత్తిచూపి—వింటిరే? యీ శశాధముండు నోరఱుగ మనల నెన్నికాఱులఱచెనో మనమెల్లరము బుద్ధిహీనులమఁట! తానేమో మనకు బుద్ధులు దిద్దెడిపాటి మహా బుద్ధిమంతుఁడఁట! మనకుఁ దనకున్న

పాటి వివేకమున్నదే! మనకుఁ జక్కట్లు దిద్దఁదాఁగాక మఱి యెవ్వరున్నారు? ఏమి దీని త్రుళ్లు? అని నిందాగర్భంబుగాఁ దోడిమసికోఁతులతోఁ నాడుచు గేలిగొనుచు నిర్దాక్షిణ్య చిత్తంబున నా చెవులపిల్లిని బిట్టుగ నేలంగొట్టి కాలంజమరి కృతాంతనిశాంతంబున కతిథింజేసి యవియన్నియుఁ గదలి జలాశయంబునకుఁ బోయి తోయంబులాఁబోవఁ ద్రావి యథేష్టంబుగం జనియె. కావున నెంతమాత్రము మూర్ఖుల కుపదేశింపఁబూనరాదు. అట్లు పూనువానికి మానక కీడు మూఁడును.

అట్లు దూఱి "యప్పక్షులెల్ల నన్ను రూక్షవీక్షణంబుల నీక్షించుచు సరోషపరుషాక్షరంబుల మఱియు నిట్లనియె. ఓరీ దుర్మతీ! నీవు మతిభ్రమగప్పి మాకడ గోరంతలు కొండంతలు చేసి చదువఁజొచ్చితివి. అంతతోనైన నిలువక నిర్భయంబుగ మా దేశమ్మును మమ్మును నూరక మీఱనాడితివి. నీవు పాపవర్తనుండవు. నీ బుద్ధి పోనిచ్చుకొందువే? ఏ వారలంగాని వారినిం బట్టుకొన్న నైసర్గికదోషంబులు విడువవు. నీవును బక్షపాతలోలబుద్ధివై నీ మనంబు వెలితియందఱకుం దేటపఱిచితివి. సర్వజనసమాదరణీయుండు చిత్రవర్ణుండు నీ కాదరణపాత్రుండు కాకపోయెఁగా! విపరీతచేతస్కులకుఁ బూజ్యులే యక్షిగతులగుదురు. నీవు నీ తరంబెఱుంగక యెక్కుడువారల ధిక్కరించెదవు. నీకింతదురాగతంబు కొఱగాదుసుమీ. మింటఁ బాఱు మొయిలుంజూచి లేచి పాఱు సహజభీరువునునాన లేక మాకడనేమో గొప్ప పౌరుషశాలియని యింత తడవును వర్ణించితివి! అట్టి మీ రాజహంసంబున కెవరు రాజ్యాధికారంబొసంగిరి? అతఁడు రాజ్యభారంబు భరియింప నెట్లు సమర్థుండగును? ఏవారు దేనిఁబూన నర్హులో వారు దానిఁబూనఁ బొసంగియుం

దురు. అట్లు గానిచో హాస్యాస్పదులగుదురు. మీ హిరణ్య గర్భుఁడా మమ్మాపదలవలనం బాచి యేలఁజాలువాఁడు? మొగిలు నీరునమ్మి చెఱువునీరు పాఱఁజల్లించునంతటి బుద్ధిమంతుండింతె వ్వాఁడును లేఁడు. మీ రాజువంటివారు వేవురైన మా రాజున కెత్తు వత్తురే? చాలుఁజాలు. ఈపాటి నీ మాట లుడుగుము. మాకుఁగాదు—నీకే మేమొక్క హితోపదేశంబు చేసెదము. తగవరివైతేని మా పలుకు సేయుము. మా రాజు మీ రాజు బోటివారి నూఱువుర రక్షింప దక్షుండు. మా మాటఁబట్టి నీవును మీ యెకిమీఁడునుగూడ మాతేని నాశ్రయించి బ్రతు కుఁడు" అని యా పలుగు పులుఁగులు దేవరందూఱునప్పుడేమి సెప్పుదు? నాకు నాకసంబును భూమియు నొక్క గ్రుక్కను మ్రింగవలెనన్నంత కోపమువచ్చినది. అయిన నేనప్పటి వెనుక ముందఱ లేమి విచారించిచేయునది లేక యాకనలెల్ల నుల్లంబుననె దిగఁద్రావి పొరలిపొరలి వచ్చు పరుషోక్తుల నాలుక తుదకు రాకుండఁ గ్రుక్కి కొంత శాంతం బవలంబించి మది కలంగియు గాంభీర్యంబు తెచ్చుకొని యిట్లంటిని. ఆ! యెట్టిమాట లివి? మీరందఱుఁ జేరి యుపచారపూర్వకంబుగాఁ బ్రార్థించియడిగిన లోకంబు తోడిపాడిగా నాకుం దోఁచినది పలికితిని. మీకది మనస్సువచ్చి చేయుదు రేని మేలు. చేయకుండినం గడుమేలయ్యె. అంతియకాని యింతమాత్రంబునకె కోపమెత్తి యిట్టి తెఱంగు మాలిన పలుకులు నోర వెడలనిచ్చుట మీయట్టి యుచితజ్ఞులకు ధర్మమగునె? మా రాజు గౌరవంబు పేర్కొన మీరేపాటివారు? ఏల నిర్నిమిత్తంబుగ నసాధారణగౌరవోదారుండగు మా తేని నోరి కొలఁదులాడి వలవని పాపంబు కట్టుకొనియెదరు? లోకం బున సాధునిందకంటె మిక్కిలి పాతకంబెద్ది? వృథాప్రయా

సంబు. ఇట్టి నోరిచేటేల? నాబుద్ధి విని యింకనైన మృదుమార్గంబు వట్టుఁడు. లోకంబున నెట్టి దిట్టలకును వాతివాఁడితనంబు చెట్టలఁ బుట్టింపకపోదు. ఎవ్వరును జాల ఉవ్విన వానిఁ బూలఉవ్వరు. కాన నేనును మిమ్మొక్కటి యడుగ వలసివచ్చెడును. మా రాజుమాట పిమ్మటఁ జూచికొందము. ఏదిట్ట మీ నట్టువ పిట్టను బక్షిరాజ్యంబునకుఁ బట్టముగట్టెనో మొట్టమొదట దాని నుడువుండు. అను నా నోటిమాటలు నోటనుండఁగనె కట్టలుక నొక పలుగాకి కనుగీట వేగ నాసైగఁ గైకొని, నగాకము లెల్లఁబెల్లురేఁగి చివ్వకుఁ జేఁజాఁచుడు లాఁతిచోశాంతంబు నల్ల యవమానంబగుచోటఁ బరాక్రమంబ పురుషులకు భూషణంబగుట దలపోసి నేనును వెనుకదీయక కలనికాయితంబయి ప్రతిఘటించి నిలిచితిని. అనవుడు నస్మితా ననుండై చక్రాంగపుంగవుండు కొంగ కిట్లనియె. ఎవ్వఁడు క్రొవ్వునఁ బరనిజశక్తులకొలంది గణింపక యెక్కుడువారల డీకొన నుంకించునో యా కట్టిడిమత్తుఁ డిక్కట్టులకెల్లఁ బుట్టినిల్లగును. తొల్లి యొక కపోతంబు పోతరంబున నంతరం బెఱుంగక సాళువంబుతో నెదిరి మదమడెను.



## 11. కృష్ణదేవరాయలు.



ఇతఁడాముక్తమాల్యద యను నామాంతరముగల విష్ణుచిత్తీయమను ప్రబంధమును రచియించిన మహాకవి. ఇతఁడు కవీశ్వరుఁడయి విద్వన్మహాకవుల నాదరించుటవలననేకాక మహారాజయి యనేకదేశముల జయించుటవలనఁగూడ సుప్రసిద్ధుఁ

డైనవాఁడు. దక్షిణ హిందూదేశమును బాలించిన రాజులలో నింత దేశమును జయించి యేలినవాఁడును, ఇంత ప్రసిద్ధికెక్కిన వాఁడును మఱి యెవ్వఁడును లేఁడు. ౧౫౦౯-వ సంవత్సరము నందుఁ గృష్ణదేవరాయలప్రభుత్వ మారంభమైనది; కృష్ణదేవ రాయలు రాజ్యమునకు రాకముం దాతని యన్నయైన వీర నృసింహరాయలు కొంతకాలము రాజ్యముచేసినట్లు కృష్ణదేవ రాయల కంకితముచేయఁబడిన గ్రంథములయందెల్లను జెప్పఁ బడియున్నది:—

క॥ వీరనృసింహుఁడు నిజభుజ
దారుణ కరవాలపరుష ధారాహతి వీ
రారియగుచు నేకాతప
వారణముగ నేలె ధరన వారణమహిమన్.

క॥ ఆవిభు ననంతరంబధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁగూర్చు దేవేరులుగన్. (మనుచరిత్రము.)

క॥ వారలలోఁ దిప్పాంబకు
మారుఁడు పరిపంథికంథి మంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమి వలయంబేలెన్.

శా॥ వీరశ్రీ నరసింహశౌరి పిదపన్ విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమునన్ జనంబు ముదమందన్ నాగమాంబాసుతుం
డా రూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులున్ గహనశైలారోహమున్ జేయఁగన్.
(పారిజాతాపహరణము.)

కృష్ణదేవరాయలు జన్మించినదినముగాని సంవత్సరముగాని సరిగాఁ దెలియదు. కృష్ణరాయల జనన మొకరు 1465-వ సంవత్సరమునందనియు నింకొకరు 1487-వ సంవత్సరమునంద

నియు వ్రాసియున్నారుగాని యందేది సత్యమైనదియు నిశ్చయించుట కాధారములేవియు దొరకలేదు. ఇతఁడు శాలివాహనశకము 1387–వ సంవత్సరము నందనఁగా, క్రీస్తుశకము 1465, వికృతిసంవత్సర పుష్యబహుళ ద్వాదశీ శుక్రవారమునాఁడు పుట్టినట్లు తెలిపెడి యీక్రింది పద్యమొకటి వాడుకలోనున్నది:—

ఉ॥ అందలి శాలివాహన శకాబ్దముల ద్రివసుత్రిసోములన్
వందితమైన యవ్వికృతివత్సరమందలి పుష్యమాసమం
దుందగు కృష్ణపక్షముననుండెడి ద్వాదశి శుక్రవాసరం
బందుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁడా నరసింహమూర్తికిన్.

ఇది మొదటివారు చెప్పినకాలముతో సరిపోవుచున్నందున దీని నధికవిశ్వాసార్హముగా నెంచవచ్చును. 1829–వ సంవత్సరములో కావలి వేంకటరామస్వామిగారు కలకత్తానగరమునందుఁ బ్రచురించిన దక్షిణహిందూదేశకవులచరిత్రములోఁ గృష్ణరాయలు తన నలువదవయేట శాలివాహన శకాబ్దములు 1446–వ సంవత్సరమునందనఁగా క్రీస్తుశకము 1524–వ సంవత్సరమునందు మృతినొందినట్లు వ్రాసియున్నారు, దీనినిబట్టి చూడఁగా నీ రాయలవారు హూణశకము 1484–వ సంవత్సరమునందుఁ బుట్టినట్లేర్పడుచున్నది; అల్లసాని పెద్దన్న చెప్పినట్టు చాటుధారగా వచ్చుచున్న యీ క్రింది పద్యమునుబట్టికూడ కృష్ణదేవరాయల మృతికాల మించుమించుగా దీనితో సరిపోవుచున్నది:—

ఉ॥ బోరన యాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహన శకాబ్దము లద్రియుగాబ్ధి సోములన్
దారణ వత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీ రవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు జేరె స్వర్గమున్
ద్వారకనున్న కృష్ణుఁడవతార సమాప్తము నొందుకైవడిన్.

ఈ పద్యమునుబట్టి శకాబ్దములు 1447-టికి సరియైన హూణశకము 1524-వ సంవత్సరమునఁ గృష్ణరాయ లంతరించి నట్లు కానఁబడుచున్నను 1530-వ సంవత్సరమువఱకు నాతని దానశాసనములు విస్తారముగానున్నందున శాసనములను బరీక్షించిన యిప్పటివారతఁడు 1530-వ సంవత్సరమునందే మృతినొందెనని నిశ్చయించియున్నారు. 1526, 1528, 1529-వ సంవత్సరములయందచ్యుతదేవరాయల దానశాసనములు సహితము రెండు మూఁడు కానవచ్చుచున్నను, అవి కృష్ణరాయల జీవితకాలములోనే చేయఁబడినవి కావచ్చును. కృష్ణదేవరాయల తండ్రియైన నరసింహరాయనికి, తిప్పాంబయనియు, నాగమాంబయనియు నిద్దఱు భార్యలు గలరు. ఆ యిరువురలో, తిప్పాంబ పట్టపురాణియనియు, నాగమాంబ భోగకాంతయనియుఁ జెప్పుదురు. కొన్ని శాసనములయందుఁగూడ నిట్లే కానఁబడుచున్నది. ఆ యిద్దఱు భార్యలలో, తిప్పాంబకు వీరనృసింహరాయలును, నాగమాంబకుఁ గృష్ణదేవరాయలును బుట్టిరి. నరసింహదేవరాయలకో బమాంబయని యింకొక భార్య యున్నట్టును, ఆమె కచ్యుతదేవరాయలు పుత్త్రుఁడైనట్టును శాలివాహనశకము 1459-వ సంవత్సరమునకు సరియైన హూణాబ్దము 1537-వ హేవళంబి సంవత్సరమున, చిత్తూరిమండలములోని నారాయణపురము నొక బ్రాహ్మణునికి దానమిచ్చుచు నచ్యుతదేవరాయలు వ్రాసియిచ్చిన తామ్రశాసనములోని యీ క్రింది వాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది:—

తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీసుమిత్రయోః
జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతీ
తస్మాదో బాంబికాదేవ్యా మచ్యుతేంద్రోపి భూపతిః.

కృష్ణదేవరాయలతండ్రి నరసింహరాజే. మధుర, శ్రీరంగ పట్టణము మొదలైనవానిని జయించి తద్దేశముల నాక్రమించి నట్లు పారిజాతాపహరణములోని యీ క్రింది పద్యమువలనఁ దేటపడుచున్నది.

సీ॥ కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగ విద్యాపురంబుఁ గైకొని నిజప్రాభి
నెఱపెఁ
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁ దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధరములిచ్చి మధురాపురంబుఁ గొ
నియెఁ
శ్రీరంగపట్టణ సీమ ఖడ్గాటీవినోదంబు హూణేంద్రునకుఁ జూపె
నతఁడు నుతికెక్కె రామసేత్వంతరాశ
కలితషోడశదాన విఖ్యాతయశుఁడు
మండలీకరమేఘమార్తాండబిరుదుఁ
డీశ్వరాధిపు నరసప్పృథ్వీశ్వరుండు.

1509–వ సంవత్సరమునకు సరియైన శాలివాహనశకము 1430 శుక్లసంవత్సర వైశాఖమాసమునందు సింహాసనమునకు వచ్చువఱకునుగల కృష్ణరాయనిచరిత్రము విశ్వాసార్హమైన దేదియుఁ దెలియదు. వీరనృసింహరాయని పైనిజూపు ప్రేమము కంటెఁ దండ్రి కృష్ణరాయనియెడ నధికప్రేమమునుఁ జూపుచు వచ్చెననియు, అది చూచి సహింపలేక వీరనృసింహరాయని తల్లి, తన సపత్నీపుత్రునిఁ జంపింపఁ బ్రయత్నింపఁగా మంత్రియైన తిమ్మరుసా జాడఁగనిపెట్టి యాతనిని దాఁచి ప్రాణమును రక్షించి కాపాడెననియుఁ దరువాతఁ గొంతకాలమునకు నృసింహదేవరాయ లుబ్బుజబ్బుచేత బాధపడుచుఁ బ్రాణావసానకాలము నందుఁ గొడుకులను బిల్చి తన వ్రేలియుంగరమును దీసికొన్న వాఁడు రాజ్యార్హుఁడని చెప్పినప్పుడు తక్కినవారు తీయుట

కుపాయముతోఁ జేక యూరకుండఁగాఁ గృష్ణరాయలు తనచేతి ఖడ్గముతో జనకుని వ్రేలు నఱికి యుంగరమును గైకొనెననియు నాతని సాహసమునకు మెచ్చి తండ్రి యాతనినే పట్టాభిషిక్తునిఁ జేయ నియమించి దేహవియోగమును బొందెననియుఁ గథలు చెప్పుదురు. నరసింహరాయని యనంతరమున జ్యేష్ఠుఁడైన వీరనృసింహరాయఁడే రాజ్యమునకు వచ్చినట్లు కృష్ణరాయని కంకితముచేయఁబడిన మనుచరిత్రాదిగ్రంథములే చెప్పుచున్నం దున నీ కడపటిసంగతి సత్యమైయుండదు. కృష్ణదేవరాయఁడు సింహాసనమునకువచ్చిన శీఘ్రకాలములోనే యుద్ధయాత్రచేసి తన రాజ్యమును నానాముఖముల వ్యాపింపఁజేసెను. దాసీపుత్రుఁడగుటచేత నాతనికి సత్కులీనులగు రాజులెవ్వరును గన్య నీయనందున సింహాసనమెక్కునప్పటికి వివాహము కాలేదు. కృష్ణదేవరాయలు 1513-వ సంవత్సరమునందు దక్షిణదిగ్విజయ యాత్రకు బయలువెడలి మహిసూరు దేశములోని యుమ్మటూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము, లోఁబఱుచుకొని గంగవంశరాజులను జయింపఁగాఁ దర్వాత మహిసూరుదేశ మంతయు స్వాధీనమైనది. ఈ దేశమును జయించిన సంగతి పారిజాతాపహరణములోని ద్వితీయాశ్వాసాంతమందలి యీ క్రింది పద్యమునందు సూచింపఁబడినది:—

శా॥ సమ్మర్దక్షమధీనిబంధన విధాసంక్రందనాచార్య, శూ
రమ్మన్యాచల వజ్రపాత, జగతీరక్షాంబుజాక్షాశర
ధ్యమ్మార్గస్థ, దశాస్యరాజ్యస మసహ్యప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరి శివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా.

ఆ సంవత్సరమునందే కృష్ణదేవరాయలు నెల్లూరిమండల ములోని యుదయగిరిమీఁదికి దండెత్తి దానికధికారిగానున్న వీర

భద్రపాత్రుని పినతండ్రియైన ప్రహరేశ్వరపాత్రుని జయించి యాదుర్గమును సాధించెను. అటుతరువాతఁ గృష్ణరాయల మంత్రియైన యప్పాజీయను నామాంతరముగల తిమ్మరుసు (సాళువ తిమ్మరాజు) నెల్లూరిమండలములోని కనిగిరి (కనకగిరి)కి రాజైనట్టియు, ఓరుగంటి ప్రతాపరుద్రుని సంతతివారిలోఁ గడపటివాఁడైనట్టియు, వీరరుద్రగజపతి కాతని కొమార్తెను గృష్ణరాయలకిచ్చి వివాహముచేయుమని సందేశము పంపెను. అతఁడు హీనకులుఁడైన కృష్ణరాయనికిఁ దన పుత్రికనీయనని స్పష్టముగాఁ జెప్పి యటువంటి బలవంతునితో విరోధము పెట్టుకొనుటకు సాహసింపఁజాలక కొమార్తె నిచ్చెదనని చెప్పి రాయలను మంత్రిసహితముగా రప్పించి యంతఃపురము సొచ్చినప్పుడు రాజు ప్రాణములు గొనఁ బ్రయత్నించెను. కోటలోఁ బ్రవేశించినతరువాత మంత్రియైన తిమ్మరు సీమోసమును గనిపెట్టి రాజుప్రాణములు కాపాడుటకై తాను రాజువేషమును వేసికొని కృష్ణరాయనికి సేవకవేషమునువేసి తనవెంటఁ గొనిపోయెను. కాని కృష్ణరాయని చేతివ్రేలినున్న ముద్రయుంగరమునుబట్టి యతఁడే రాజని యంతఃపురములోని వారానవాలుపట్టిరి. ప్రాణోపద్రవము సంభవింపనున్న యాసమయమునందు ధీమంతుఁడైన మంత్రి యుపాయమువలన రాజు, తానును, మంత్రియు నెట్లో ప్రాణములు దక్కించుకొని పాఱిపోయి స్వదేశమును జేరినతోడనే సేనలనుగూర్చి కనిగిరిమీఁద దండెత్తివచ్చి వీరరుద్రుని రాజ్యమును, అతని పుత్రికయైన చిన్నాదేవినిఁ, గైకొని ద్రోహియైన యాతనిఁ జంపక కుటుంబసహితముగా వింధ్యపర్వత ప్రాంతములకుఁ బాఱఁదోలెను. వీరరుద్రుని శుద్ధాంతస్త్రీలు

వింధ్యపర్వతముపాలైనసంగతిని మనుచరిత్రమునందల్లసాని పెద్దన యీరీతిగ వర్ణించియున్నాఁడు:—

మ॥ ధరకెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతిన్ వింధ్యగ
హ్వరముల్ దూరఁగఁజూచి తారచటఁ గాపైయుండుటంజాలన
చ్చెరువై యెఱ్ఱని వింతచీకఁటులువచ్చెం జూడరే యంచు తే
సొరిదింజూతురు వీరవధ్రగజరాట్పుచ్ఛాంతముద్ధాంగనల్.

కృష్ణరాయలు 1515–వ సంవత్సరమునందుఁ బూర్వ దిగ్విజయయాత్ర వెడలి యా సంవత్సరమునందే కొండవీడు, బెల్లముకొండ, వినుకొండ, బెజవాడ, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలైన ప్రదేశములను జయించి 1516–వ సంవత్సరమునందు విశాఖపట్టణమండలములోని భీమునిపట్టణమున కైదు క్రోసులదూరములోనున్న పొట్నూరివద్ద రాతిజయస్తంభము వేయించి యా మండలములోని వీరవల్లి తాలూకాలోని వడ్డాది జయించి, ఉత్కల దేశములోని కటకపురమువఱకును బోయి కటకపురమును గాల్పఁగా, కళింగదేశాధిపతియై యోఢ్రదేశమును బాలించుచుండిన ప్రతాపరుద్రదేవుఁడు తన కొమార్తెయైన తిరుమలదేవిని రాజునకిచ్చి వివాహముచేసి సంధిచేసికొనెను. అందుచేతఁ గృష్ణదేవరాయలు రాజమహేంద్రవరము వఱకునుగల కళింగదేశమును మరలఁ బ్రతాపరుద్రదేవునకిచ్చివేసి 1516–వ సంవత్సరాంతమునఁ గాంచీపురము ప్రవేశించెను. ఈతని ప్రథమభార్యయైన చిన్నాదేవికి, అన్నపూర్ణాదేవియనియు నామాంతరము గలదు. ఈతనికిఁ దిరుమలదేవియు, నన్నపూర్ణాదేవియు నిద్దఱు భార్యలగుటను, గృష్ణరాయలు తాను రచియించిన విష్ణుచిత్తీయమునందిట్లు తెలిపియున్నాఁడు:—

క॥ ఆవిభుననంతరంబ ధ
రావలయముఁ బూనితీవు రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్.

ఈతఁడు పూర్వ దిగ్విజయయాత్రలో సింహాచలమును దర్శించినప్పుడు భార్యాసహితముగాఁ జేసిన దానమును గూర్చి సింహాచల దేవాలయములో నేడవస్తంభము మీఁదఁ జెక్కించిన యీ క్రిందియంశమును విశాఖపట్టణ మండలచరిత్రమునుండి తీసికొనుచున్నాను.—

"శుభమస్తు శ్రీమన్మహారాజాధిరాజ పరమేశ్వర మూరు రాయరగండ ఆదిరాయ విజయభాషాగీత ప్రవరరాయరగండ యవనరాజ్యసంస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవ మహారాజులు విజయనగరాన సింహాసనస్థులై పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేసి, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1438 అగునేటి ధాతసం॥ చైత్ర బ॥ 12 స్థిరవారాన సింహాద్రినాథు దర్శించి తమ తల్లి నాగదేవమ్మగారికిన్ని తమ తండ్రి నరసరాయునిగారికిన్ని పుణ్యముగాను దేవునికి సమర్పించిన కంఠమాల 1-కి ముత్యాలు 991, వజ్రమాణిక్యాల కడియాల జోడు 1-కి శంఖచక్రాలపతకం 1-న్ని, పయిడి పళ్లెము 1-కిన్ని తూకాలుగ 44292 కాని మాడలుగ 2000 తమ దేవి చిన్నాదేవమ్మగారిచేతను సమర్పించిన పతకం 1-కి గ॥ 500 తిరుమలదేవమ్మగారిచేతను, సమర్పించిన పతకం 1-కి గ॥ 500 యింతమట్టుకు సమర్పించిన ధర్మశాసనము."

కృష్ణరాయలవిజయములనుగూర్చి పారిజాతాపహరణము నందును, మనుచరిత్రమునందును జెప్పఁబడిన కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను:—

చ॥ మునుకొని కొండవీటికడ మూఢతరుద్రుఁడు కృష్ణనందను
న్ననసిజునిన్ జయించెనది మానుషమే నరసేంద్రు కృష్ణరా
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁడగు వీరభద్రుఁ గరుణామతిఁగాచె జగత్ప్రసిద్ధిగన్.

చ॥ నెలకొని కృష్ణరాయధరణీ విభుఁడుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకాండతతుల్ మసకఁ పుఁ బాము లై
మలసిన చోటఁగూడి నసమగ్రయశోవసనంబు గప్పితా
వలవఁగఁజేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడుగాన నేర్పునన్.

సీ॥ ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె వినుకొండమాటమాత్రన హరించెఁ
గూటముల్సెదరంగఁ గొండవీడగలించె బెల్లముకొండ యచ్చెల్లఁజేసె
వేలుపుకొండను ద్వ్యత్రిభంగము సేసె జల్లిపల్లె సమగ్రశక్తిఁగూల్చెఁ
గినుకమీఱన నంత గిరి క్రిందుపడఁజేసెఁ గంబంబుమెట్టు గ్రక్కనఁ గదల్చె

బలని కాయము కాలుమట్టులనడంచుఁ
గటకమును నింకననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

(పారిజాతాపహరణము.)

సీ॥ తొలుదొల్తనుదయాద్రి శిలఁదాఁకి తీర్థ్రించు నసిలోహమున వెచ్చనయి జనించె
మఱి కొండవీడెక్కి మార్కొనినలిర్యైన యలకసవాపాత్రు నంటి రాఁజె
నటసాగి జమ్మిలోయఁబడి వేగ దహించెఁ గోన బిట్టేర్చెఁ గొట్టాన దడ గిలెఁ
గనకగిరి స్ఫూర్తిఁగరఁచె గౌతమిఁ గ్రాఁచె నవులనా పొట్నూరు రవులు కొనియె

మాడెములు వ్రేల్చె నొడ్డాదిమసియొనర్చెఁ
గటకపురిఁగాల్చె గజరాజుగలఁగిపఱవఁ
దోఁకచిచ్చన నౌరయుద్ధురతఁ గృష్ణ
రాయ బాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

* * *

చ॥ అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళ స
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకుందిగు సురప్రకరంబు కళింగ మేదినీ
విభునపకీర్తికజ్జలము వేమఱుఁబెట్టి పఠించు నిచ్చలున్.
(మనుచరిత్రము.)

పూర్వ దిగ్విజయయాత్ర చేసివచ్చినతరువాత మూఁడు సంవత్సరములవఱకును కృష్ణదేవరాయలు యుద్ధము లేమియుఁ జేసినట్టు కానఁబడదు. అతఁడా కాలమునందంతటను విద్యావ్యాసంగమునందు ప్రొద్దుపుచ్చుచుండెను? అల్లసాని పెద్దన తన స్వారోచిష మనుచరిత్రమును, నందితిమ్మన తన పారిజాతాపహరణమును, 1516–వ సంవత్సరమునకు తరువాతను, 1520–వ సంవత్సరమునకు లోపలను కృష్ణరాయని కంకితము చేసిరి. 1519–వ సంవత్సరాంతమునందు బీజపుర మహమ్మదీయులతో యుద్ధము చేసి 1520–వ సంవత్సరమునందు సుల్తానయిన యేదిల్ ఖానుని జయించెను. ఈ యుద్ధవార్త పూర్వోక్తములైన రెండు గ్రంథములయందు నుదాహరింపకపోవుటచేత నవి యీ యుద్ధమునకుఁ బూర్వమునందే రచియింపఁబడినట్టు నిశ్చయింపవలసి యున్నది. అయినను కృష్ణదేవరాయలే తన యాముక్తమాల్యదయం దీయుద్ధవృత్తాంతము నీ క్రింది పద్యముచేఁ జెప్పి యున్నాఁడు:—

మ॥ అలుకస్ఫోటకఘట్టికాఖురపుటీహల్యక్షురాసానిపు
చ్ఛలువోఁ దున్నిచలచ్చమూగజమదాసారప్లుతిన్ గీర్తి పు
ష్కల సస్యంబిడియేకధాటి బళిరా కట్టించితౌ దృష్టికే
దులఖానోగ్రకపాలమర్దపహరిద్యూపాంగళశ్రేణికన్.

పైపద్యమునుబట్టి యాముక్తమాల్యద 1520-వ సంవత్సరమునకుఁ దరువాత రచియింపఁబడినట్లేర్పడుచున్నది. ఓరుగల్లు, గోలకొండ మొదలైన సంస్థానములనుగూడ జయించి యితఁడు తన రాజ్యమును దక్షిణహిందూస్థానమందంతటను వ్యాపింపఁ జేసెను. ఈ దక్షిణదేశమును పాలించిన రాజులలో నింత గొప్పరాజ్యమేలిన రాజు మఱి యెవ్వఁడును లేఁడు. ఒడ్డిరాజులైన గజపతులను, తురుష్కరాజులైన యశ్వపతులను, తెలుఁగు రాజులైన నరపతులను జయించుటచేత నీతనికి మూరురాయర గండఁడని బిరుదుకలిగినది. ఇటువంటి బిరుదములనేకము లీయనకుఁ గలవుగాని యవియన్నియు నిందు వివరించుట యనావశ్యకము. ఈతఁడు శ్రీరంగపట్టణము, మధుర, తిరుచనాపల్లి మళయాళము మొదలైన దేశములను పాలించుటకు తెలుఁగు నాయకులను పాలకులనుగా నేర్పఱిచెను. ఈతఁడే తుంగభద్రానదికి విజయనగరమునకు వంతెనకట్టెను. ఈతనికి తిమ్మరుసుమంత్రిగానుండెనుగాని యతఁడు రాజునకంటె మూఁడుసంవత్సరములు ముందుగా మృతినొందెను.

ఈ కృష్ణదేవరాయలది తుళువవంశము; ఇంటిపేరు సాళువవారు; పూర్వులావఱకు వసియించిన గ్రామనామములనుబట్టి సంపెటవారనియు, సెలగోలవారనియు కూడ గృహనామము కలదు. ఈ కడపటి రెండుపేరులును కరణములు వ్రాసియుంచిన కొండవీటికవిలెచరిత్రమునం దుదాహరింపఁబడియున్నవి. ఇంత

వఱకు రాజుయొక్క విజయములనుగూర్చి సంక్షేపముగా వ్రాసి యున్నాను. ఇఁక నీతని పాండిత్యప్రభావాదులనుగూర్చి కొంత వ్రాయవలసియున్నది. పూర్వకాలమునందు భోజరాజు సంస్కృతభాష నాదరించినట్లే యితఁ డాంధ్రభాష నాదరించి కవులను సమ్మానించి గ్రంథరచనచేయించుటచేత నీతని కాంధ్రభోజుఁడని బిరుదుపేరు కల్గినది. ఇతఁడు కవుల నాదరించి కావ్యములు చేయించుటయేకాక తానుగూడ విద్వాంసుఁడై సంస్కృతాంధ్రములయందు గ్రంథములను రచియించుటకు సమర్థుఁడైయుండెను. ఈతఁడు సంస్కృతమునందుఁ బెక్కుగ్రంథములు రచించినట్లు విష్ణుచిత్తీయమునందలి యీ పద్యమునందుఁ జెప్పఁబడియున్నది:—

సీ॥ పలికితుత్ప్రేక్షోపమలజాతి పెంపెక్కరసికులౌననమదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహితలేర్చికూర్చితి సకల కథసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చఁగ రచించితి సూక్తినైపుణిజ్ఞాన చింతామణి
కృతి

మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటివి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతివి నిర్మింపుమిఁక మాకుఁ బ్రియముగాఁగ.

అయినను కృష్ణదేవరాయలు రచియించిన యీ సంస్కృతగ్రంథములేవియు నిప్పుడు గానరాకున్నవి. సంస్కృతము మాట యెటున్నను, కవులను బ్రోత్సాహపఱిచి కావ్యములు చేయించియు, తానుజేసియు తెలుఁగు భాషకీయన మహోపకారముచేసి యున్నాఁడు. ప్రబంధరచనము క్రొత్తగా నీ కృష్ణ

దేవరాయలకాలమునందే యారంభమైనది. అంతకుఁ బూర్వము నందున్నకవులు సంస్కృతమునుండి పురాణములను, ఇతిహాస ములనుమాత్రము తెనిఁగించుచువచ్చిరి. వారిలోఁ గేతనయను కవి యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రమును, దండివిరచితమైన దశకుమార చరిత్రమును, శ్రీనాథుఁడనుకవి శ్రీహర్షవిరచితమైన నైషధకావ్య మును, బద్యకావ్యములనుగాఁ దెనిఁగించిరి. బాణవిరచితమైన కాదంబరి యాంధ్రీకరింపఁబడినట్లు కానఁబడుచున్నదిగాని కొన్ని లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన పద్యములుతక్క గ్రంథమెక్కడను పూర్ణముగా దొరకకున్నది. ఏది యెట్లున్నను కృష్ణదేవరాయనికిఁ బూర్వకాలమునందలి కవులు రచియించిన యాంధ్రగ్రంథములన్నియు సంస్కృతమునుండి చేసిన భాషాం తరములేకాని స్వబుద్ధికల్పితముగా రచించిన నూతనగ్రంథమం దొక్కటయుఁ గానరాదు. తెలుఁగునందు నూతనముగాఁ బ్రబం ధరచనచేసి తరువాతివారికి దారిచూపినవాఁడు కృష్ణదేవరా యని యాస్థానకవియైన యల్లసాని పెద్దనామాత్యుఁడు. ఆతఁడు రచియించిన మొదటి ప్రబంధము స్వారోచిషమను సంభవమను మనుచరిత్రము. ఈ గ్రంథమునందలికథ మార్కండేయపురా ణమునుండి గ్రహింపఁబడినది; మొట్టమొదట నీ మనుచరిత్ర మును ప్రబంధరూపమున రచియింపఁబట్టియే పెద్దనార్యున కాం ధ్రకవితాపితామహుఁడను బిరుదనామము కలిగినది. కృష్ణ దేవరాయలకు సంస్కృతాంధ్రములయందు నసాధారణపాండి త్యము కలిగియుండుట నాతఁడు రచియించిన యాముక్తమా ల్యదయే సహస్రముఖముల ఘోషించుచున్నది. ఆముక్తమా ల్యద కృష్ణరాయకృతముకాదనియు, దానిని, తదాస్థానకవి యైన పెద్దనార్యుఁడు రచించి పుస్తకమునఁ దన ప్రభువునకుఁ

గర్తృత్వము నారోపించెననియు, వాడుకకలదుగాని యది యంతగా విశ్వసనీయముగాదు. కృష్ణదేవరాయ ల్లసాని పెద్దనను, రామరాజభూషణుని, ప్రబంధములను రచియించి తెమ్మని యాజ్ఞాపించెననియు, తదాజ్ఞానుసారముగా వారిరువురును గ్రంథరచనచేసి తమ ప్రబంధములను దీసికొనిరాఁగాఁ జూచి రాజు వసుచరిత్రమునకంటె మనుచరిత్రము లేఁతపాకమునఁ బడినదని యభిప్రాయము తెలిపెననియు, అందుమీఁదఁ పెద్దన "యాముక్తమాల్యద" అనుపేర విష్ణుచిత్తునిచరిత్రమును రచియించి తీసికొనిరాఁగా విష్ణుచిత్తీయము ముదురుపాకముగా నున్నదనియెననియు, చెప్పుదురుగాని యిదియంతయు నిటీవలివారి స్వకపోలకల్పితము. వసుచరిత్రమును రచియించిన రామరాజభూషణుఁడు కృష్ణదేవరాయనికాలమందుండెనో లేఁడో యని సందేహింపవలసియున్నది. ఉండినపక్షమున నతఁడా కాలమునఁ బిన్నవయసువాఁడయి యుండవచ్చును. ఆముక్తమాల్యదయు మనుచరిత్రమును రచియింపఁబడినతరువాత నేఁబదియేండ్లకుఁగాని రామరాజభూషణుఁడు వసుచరిత్రమును రచియింపలేదు. కాఁబట్టి పైకథ యెంతమాత్రమును నమ్మఁదగినదిగాదు. ఆముక్తమాల్యదకును, మనుచరిత్రమునకును, శైలియందు విశేషభేదముండుటచేతను, ఆముక్తమాల్యద వ్యాకరణదోషయుక్తమైనదిగానుండుటచేతను, ఆ రెండు పుస్తకములు నేకకవిచే రచియింపఁబడినవికావని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పెద్దనకవిత్వములో లేని యికారసంధులును, తత్సమశబ్దములయం దకారసంధులును, క్త్వార్థకసంధులును, ఆముక్తమాల్యదయందుఁ గానఁబడుచున్నవి. కాఁబట్టి యాముక్తమాల్యద సర్వలక్షణవేత్తయైన యల్లసాని పెద్దన విరచితముకాదనుట స్పష్టము. అంతేకాక యీ

పుస్తకము పెద్దన కవనమువలె మృదువైనదియు నల్లికగలదియుఁ గాక కటుపద భూయిష్ఠముగానున్నందునను పెద్దనార్య కృతము కాదని నిశ్చయింపవలసియున్నది. అయినను కృత్యాద్యవస్థ యందు వంశావళిలో పెద్దనప్రణీతమైన మనుచరిత్రములోని పద్యములే యిందుఁ గానఁబడుచున్నందున రెంటికిని గృతికర్త లొక్కరే యని యూహింపవలసియుండునని కొందఱందురుగాని యాయూహ సరిదైనదిగాదు. వంశావళిలో కృష్ణదేవరాయని జయములును గుణవర్ణనలునుమాత్రమే యధికముగానున్నందున, ఆత్మస్తుతిని దన పద్యములతోఁ జేసికొనుట కిష్టములేని వాఁడయి కృష్ణదేవరాయలు ప్రథమపురుషములను మధ్యమ పురుషములనుగా మార్చి వేంకటేశ్వరుఁడు తన్నుఁగూర్చి పలికినట్లుగా మనుచరిత్రములోని పద్యములనే తన యాముక్తమాల్యదయందు వేసికొనియుండును. అయినను విష్ణుచిత్తీయమునందు ముఖ్యముగా నైదవ యాఱవ యాశ్వాసములయందు పెద్దన పద్యములవంటి "యల్లికజిగిబిగి"గల పద్యములును, నంది తిమ్మనపద్యములవంటి "ముద్దుపలుకులు"గల పద్యములును బెక్కులు గానఁబడుచున్నందునఁ గృష్ణదేవరాయలు తన యాస్థానకవీశ్వరులైనవారి సాహాయ్యమును స్వగ్రంథరచన యందుఁ బొందియుండును. ఒక్క సాహాయ్యమే యననేల? ఆ యిరువురు కవులును ముఖ్యముగా నాంధ్రకవితాపితామహుఁ డని పేరొందిన యల్లసానిపెద్దనయు రచించిన పద్యములే పెక్కు లాముక్తమాల్యదయందున్నట్లు కానఁబడుచున్నవి. అంతమాత్రముచేత గ్రంథకర్తృత్వమును వారి కారోపించుట వలనుపడదు. గ్రంథమును రాజే చేయఁగా తదాస్థానకవులు కొన్ని పద్యములను మార్చియు, కొన్నిపద్యములను తమవి చేర్చియు నుం

దురు. కృతికర్త కృష్ణదేవరాయలనుటకు నాశ్వాసాంతముల యందు కృత్యాదియందును జెప్పఁబడుటమాత్రమేకాక "పలికితుత్త్రేక్షోపమల" నిత్యాదిపద్యములలో నుదాహరింపఁబడిన తద్రచితగ్రంథనామములును తత్కర్తృత్వమును స్థాపించుచున్నవి. ఈ కృష్ణరాయలు కవిత్వమునందు సమర్థుఁడని యాతని కాలమునం దాముక్తమాల్యదను రచించుటకు ముందే యాతని యాస్థానకవులు చెప్పియుండుటకూడ విష్ణుచిత్తీయము కృష్ణరాయకృతమనుటను స్థిరీకరించుచున్నది. ఈ రాజు కవిత్వమునందు నిపుణుఁడనుటను సూచించుచు రాజునుగూర్చి "కవితాప్రావీణ్యఫణీశ" యను విశేషణము నుపయోగించిన పారిజాతాపహరణములోని నందితిమ్మనార్యునిపద్యము నొకదాని నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను:—

క॥ శ్రీవేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయ మహీశా. ఆ. 4.

అక్కడక్కడ వ్యాకరణస్ఖాలిత్యములున్నను, కటువుగానున్నను మొత్తముమీఁద విష్ణుచిత్తీయముయొక్క కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను, అర్థగాంభీర్యము కలదిగాను, అలంకారబహుళమయి, స్వభావవర్ణనలు కలదిగాను ఉన్నది. అందుచేతనే రేఫశకటరేఫములనిమిత్తమయి, పెనఁగులాడిన యప్పకవివంటివాఁడు సహితము యతిప్రాసములయందు ద్విరేఫమైత్రి నంగీకరించిన యీకవిగ్రంథమును గుణబాహుళ్యమునుబట్టి లాక్షణికమైన దానినిగా నంగీకరించి తన లక్షణగ్రంథమునం దాముక్తమాల్యదనుండి పద్యములను లక్ష్యములనుగాఁ దీసి

కొనియున్నాఁడు. తాను బూర్వము దిగ్విజయయాత్రకు వెడలి బెజవాడయందుఁ గొన్నిదినములుండి కృష్ణామండలములోని శ్రీకాకుళమునందలి యాంధ్రవిష్ణుదేవుని సేవింపఁబోయిన హరి వాసరమునాఁటిరాత్రి యాదేవుఁడు స్వప్నములో తోఁచి వేంక టేశ్వరున కంకితముగాఁ దెనుఁగుగ్రంథమును జేయుమనఁగా విష్ణుచిత్తీయమును రచించినట్లు కవి తన గ్రంథమునం దీక్రింది వచనములతోఁ జెప్పియున్నాఁడు. "......కళింగదేశవిజిగీషా మనీషఁ దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపఁబోయి హరివాసరోపవాసం బచ్చుటఁగావింప నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున, * * * * * *

గీ॥ తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను
తెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

క॥ అంకితమోయన నీకల
వేంకటపతి యిష్టమైన వేల్పుగుటఁదదీ
యాంకితముసేయు మొక్కొక
సంకేతము గాకతఁడెరసన్నేఁగానే.

కళింగదేశ విజయయాత్రకయి వెడలి విజయవాటి (బెజవాడ)కి వచ్చినది హూణశకము 1515-వ సంవత్సరమగుటచేత రాజీగ్రంథము నా సంవత్సరమునందుఁ జేయనుద్దేశించి ప్రారంభించియుండును. అయినను వెనుక నుదాహరించిన యుపోద్ఘాతములోని "అలుకఁ ఘోటక" ఇత్యాదిపద్యము నందు వర్ణింపఁబడిన (1520-వ సంవత్సరమునందు జరగిన) యేడిఖానుని జయించిన వర్ణన మిందుండుటనుబట్టి యీ గ్రంథము

1520-వ సంవత్సరమువఱకును ముగింపఁబడలేదు. ఈ పుస్తకమునందలి పద్యములు మొత్తముమీఁద శ్రుతికటువులుగా నున్నను, పెక్కుపద్యము లర్థగాంభీర్యముగలవిగానుండుటయే కాక మృదుమధురపదగుంభితములైకూడ నున్నవి. కవి యొక్క ప్రౌఢిమయు కవననైపుణ్యమును దెలియుటకయి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను:—

చ॥ బలసినహల్లకచ్ఛటలపైఁ దమ జుంజురుముండ్లు రాయఁగాఁ
గలమములుండుఁ బండి యొఱగంబడి నీరెడలింపఁ దృష్ణలోఁ
దలకొనవంగి మున్జలముఁ ద్రావెడు క్రిందటివేళ్లు మీఁదట
న్నిలిపి మరందమానుకరణిన్నికటోపవనానిలాహతిన్. ఆ. 1.

మ॥ గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్యభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్ర ధృతియో ప్రాగ్దీపికారోపమో
స్పృహరీవాదములేల లేరె యితరుల్నీలీలకుం బాత్రముల్. ఆ. 2.

ఉ॥ నావుడువారలమ్మనుజ నాథునకిట్లని రబ్బి నేఁడుగా
దైవముగల్గెవేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీవలయంబ శేషమును వేఁడుము భూవర మమ్మునందఱం
బ్రోవుము బాంధవాప్త జనపోషణకంటెను ధర్మమున్నదే. ఆ. 3.

ఉ॥ హెచ్చినమైత్రిఁ బద్మినులకెల్ల ఘనాత్యయకారకుండు సా
ష్మచ్చుపడంగఁ జేయుటకునైయల క్రౌంచనగంబు పేరిక
మ్మచ్చున నీడ్చు శర్వగిరియందలి వెండిశలాక పిండునా
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁగొలంకులఁ జక్రఘుంకృతిన్ ఆ. 4.

ఆ ముక్తమాల్యదనుబట్టియే కృష్ణదేవరాయలు విష్ణుభక్తుఁడనియు వైష్ణవశిష్యుఁడనియు వేఱుగఁ జెప్పనక్కఱలేకయే తెలిసికొనవచ్చును. అతఁడు విష్ణుభక్తుఁడైనను, వైష్ణవశిష్యాగ్రేసరుఁడైనను, ఇతరదేవతలయందుఁగాని, యితరమతముల వారియందుఁగాని వైషమ్యములేనివాఁడై యుండెను.

ఈ రాయలవారు విష్ణుదేవాలయములకుమాత్రమేకాక శివాలయములు మొదలైనవానికిఁగూడ భూదానములు చేసియున్నాఁడు. వైష్ణవమతాభిమానులనుమాత్రమేకాక యితర మతావలంబులైన విద్వాంసులనుగూడ నాదరించియున్నాఁడు. ఆతని యాస్థానములో నల్లసానిపెద్దన మొదలైన వైష్ణవమత పక్షపాతులైన కవులుమాత్రమేకాక, స్మార్తుఁడై శివభక్తుఁడైన నందితిమ్మనార్యుఁడును, కేవల శైవులైన ధూర్జటియు, మాదన గారి మల్లన్నయు, మొదలైన కవులునుగూడ సమ్మానమును బొందియున్నారు. అష్టదిగ్గజములని పేరొందిన యెనమండ్రు తెలుఁగుకవులీరాజుయొక్క యాస్థానమునందుండి ప్రసిద్ధినొందిరని చెప్పుదురు. అల్లసానిపెద్దన్న, నందితిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారి మల్లన్న, పింగళిసూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలిరామకృష్ణుఁడు అనెడి యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుకగలదు. కాని యిందుఁ జెప్పఁబడినవారిలోఁ గడపటి ముగ్గురును గృష్ణదేవరాయనికాలమునందున్నారో లేరోయని సందేహింపవలసియున్నది. మొదటి యైదుగురుమాత్ర మాకాలమునందున్నట్లు కొన్నిగ్రంథనిదర్శనములు కనఁబడుచున్నవి. వారిలో నల్లసానిపెద్దనార్యుఁడు తాను రచియించిన మనుచరిత్రమును, నందితిమ్మన్న తాను రచియించిన పారిజాతాపహరణమును, కృష్ణదేవరాయని కంకితములుచేసిరి. అయ్యలరాజు రామభద్రుఁడు కృష్ణదేవరాయల కాలమునందు మిక్కిలి చిన్నవాఁడై క్రొత్తగాఁ గవిత్వము చెప్పుట కారంభించెను. ఇతఁడు కృష్ణదేవరాయలు జీవించియుండఁగా నాతని యాజ్ఞాప్రకారముగా సకల కథాసారసంగ్రహము నారంభించి తరువాత ముగించెనుగాని యది రామా

భ్యుదయమువలె నంత ప్రౌఢముగానుండక వ్యాకరణదోష ములుకలదిగానున్నది. రామభద్రకవి తన్నుఁ గృష్ణరాయలు కోరుటచేత సకలకథాసారసంగ్రహమును జేసితినని వ్రాసికొన్న భాగము నా గ్రంథమునుండి యిందుదాహరించుచున్నాను:—

సీ॥ చినుకుపూసలనొనర్చిన బిత్తరపుదండదండాలుఁగలవేల్పు తపసికొండ
కొండాటములును జిక్కులుపన్ను జడదారి దారిగట్టులరాయు చీరుటలుఁగు
అలుగుడింతికి వెన్నుఁడిలకుఁదెచ్చిన చెట్టు చెట్టుగట్టుఁగఁజేయు చెలువతోడు
తోడుచేడెల నేలు దొరకును దోఁబుట్టు పుట్టులిబ్బుల తేని పొందుగాఁడు
గాడుపూగిని గాంచిన కన్నతల్లి
తల్లిబిడ్డల బెండ్లాడు గొల్లమనికి
మనికితముదీర్చు విలుకానిఁ జెనకువిందు
విందు నీకీర్తి నరసింహ విభునికృష్ణ.

ఇట్లు కీర్తి విస్తారధురంధరుండగు కృష్ణరాయ నరపాలాఖండ లుండు నన్నుఁబిలిచి శ్రీమచ్ఛీతారమణచరణకమల పరిచర ణాయమానమానసుండవు, బహువిధ కవితా చమత్కార ధుర్యుండవు, సకల పురాణేతిహాసప్రబంధరచనాదక్షుండవు, మన్మనోరథకార్యనిర్వాహకుండవు నగుటంజేసి పురాతన మహా కవి విరచితప్రబంధంబు లన్వేషించి భగవద్భక్తి నిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబులగునట్లుగాఁ బ్రశస్తకథలు విన్యస్తంబులుగా సమకూర్చి సాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభా వంబు లొక్కొక్కచోటఁ గనంబడ నతిమధురరసాయన ద్రాక్షా పాకంబుగా శృంగారరసయుక్తంబగునట్లు సకలకథాసారసం గ్రహంబు గ్రంథవిస్తారంబుగాకుండునట్లుగా రచియింపుమని యుపన్యసించిన సంతోషామృతతరంగితాంతరంగుండనగుచున్న సమయంబున రాజశేఖరచరిత్రమును రచియించిన మాదయ

గారి మల్లన్న కృష్ణదేవరాయలకాలములోనుండి యా రాజు గోలకొండ బిజాపురపు తురకసంస్థానములను జయించినప్పు డాతనికీర్తిని వర్ణించినట్లు కుమారధూర్జటి కృష్ణరాయవిజయము నందు నీ క్రింది పద్యములతోఁ జెప్పియున్నాఁడు:—

గీ॥ అటులు జయలక్ష్మిఁ గైకొని యరులకరుల
హరులధనపఙ్క్తులను దనపరముచేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవగరిమ
కాంచి కన్నులపండువు గాఁగనపుడు.

గీ॥ సరససాహిత్యరచన విస్ఫురణ మెఱయ
సారమధురోక్తి మాదయగారి మల్ల
నార్యుఁడల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు.

క॥ వినిపించిరపుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనతనొసఁగి యా
జనవరుఁ డప్పాజిఁ గనుం
గొని యిట్లని పలికెనపుడు కుతుకంబలరన్. ఆ. 3.

ఈ కుమారధూర్జటికవియే కాళహస్తిమాహాత్మ్యమును రచియించిన తన పెదతాతయైన ధూర్జటికవి కృష్ణదేవరాయల సభలోఁ బ్రసిద్ధిపొందినట్లు కృష్ణరాయ విజయములో నీ క్రింది పద్యముచేతఁ జెప్పియున్నాఁడు:—

చ॥ స్తుతమతియైన యంధ్రకవి ధూర్జటిపల్కులకేలఁ గల్గెనో
యతులిత మాధురీమహిమ నామును మీ పెదతాత చాల స
న్నుతిఁగనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభన్ వినుమీవునట్ల మ
త్కృతబహుమాన వైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్. ఆ. 1.

అష్టమహిషీకల్యాణమును ద్విపదకావ్యముగా రచించిన తాళ్లపాక చిన్నన్నయను కవికూడ కృష్ణదేవరాయనికాల

ములోనున్నట్లు కొండవీటిచరిత్రములో కృష్ణదేవరాయల దానములనుగూర్చి చెప్పిన యీ క్రిందివాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది:—

“వినుకొండసీమలో మిన్నికల్లు తాళ్లపాక చిన్నయ్యగారి కగ్రహారమిచ్చెను.” “అద్దంకిసీమలో వలపర్ల అను గ్రామము తాళ్లపాక చిన్నయ్యగారికిచ్చెను.” వీరుగాక తక్కినకవులు కృష్ణదేవరాయల యాస్థానమునందుఁగాని యాతని కాలమునందుఁ గాని యున్నట్లు తోఁచదు. రామరాజభూషణాదులు కృష్ణరాయల యాస్థానమునందున్న ట్లనేక కథలు కానఁబడుచున్నవి కాని యితర నిదర్శనములులేక యవి విశ్వసింపఁదగినవికావు. ఆయా కవులకాలమునుగూర్చియు వారివారి విషయమై చెప్పఁబడు కథలనుగూర్చియు, నాయా కవులచరిత్రములయందు వ్రాయఁబడును. ఆముక్తమాల్యదయందును మనుచరిత్రమునందునుగల యేకరీతి పద్యములనుగూర్చి సహేతు మిచ్చుట విస్తరించి వ్రాయుట యనావశ్యకము. అయినను దృష్టాంతము చూపుటకై యొక్క పద్యమునుమాత్ర మిందుదాహరించుచున్నాను:—

సీ॥ నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు మెఱుఁగుజామనచాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడఁగించు జిగిహెచ్చు నాయితంబగుకన్ను దోయితోడఁ
బులుగురాయనిచట్టు పలవన్నె నొరవట్టు హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపువిడంబంబు దొరలంగనాడు కౌస్తుభముతోడ

జయజయధ్వని మాళిగం జలుఁలుచేర్చు
శర్వశతధృతి శతమన్యుశమనశరధి
పాలకైలబిలాది దేవాళితోడ
నెదుటఁ బ్రత్యక్ష్యమయ్యె లక్ష్మీశ్వరుండు.

మనుచరిత్ర. ఆ. 6.

మనుచరిత్రముయొక్క యాఱవ యాశ్వాసమునందు స్వారోచిషమనువు విష్ణునిగూర్చి తపస్సుచేయఁగా నతఁడు ప్రత్యక్షమయినట్లు చెప్పఁబడిన పైపద్యమునే దీర్ఘపాదములనేమియు మార్పక యెత్తుగీతమునుమాత్ర మీ క్రిందిరీతిగా మార్చి యాముక్తమాల్యద ప్రథమాశ్వాసమునందుఁ గృష్ణదేవరాయఁడు తనకు శ్రీకాకుళాంధ్రదేవుఁడు ప్రత్యక్షమైనట్లు చెప్పిన ఘట్టమునందు వేసికొని యున్నాఁడు:—

సీ॥ నీలమేఘముడాలు . . . . . . కౌస్తుభముతోడ

గీ॥ పమ్మికేలుండఁ బెఱకేల నంపయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు క్షేమతోడఁ
దొల్కుదయఁదెల్పు చిఱునవ్వుతోడఁ గలఁద
దంధ్రజలజాక్షుఁడిట్లని యానతిచ్చె. ఆముక్తమాల్యద. ఆ. 1

కృష్ణరాయలనుగూర్చి బహు కవులు చాటుపద్యముల నేకములు కూర్చియున్నారుగాని గ్రంథవిస్తారభీతిచేత వానినన్నిటి నిందు వ్రాయక రెండుమూఁడు పద్యములనుమాత్రము చూపుచున్నాను.

ఉ॥ పెనిమిటిచేయు పుణ్యజనపీడన వృత్తియుఁ దండ్రి భంగముం
దనయుననంగభావము దమ్ముని కార్శ్యముఁ జూచి రోసి స
జ్జనపరిరక్షు శౌర్యనిధిఁజారు శరీరుఁ గళాప్రపూర్ణు న
న్వన నిధి కన్యచేరెఁ జితవైరినికాయునిఁ గృష్ణరాయనిన్.

రాజుమాత్రమేకాక కృష్ణరాయని కొమార్తలును సంగీత సాహిత్యములయందు నిపుణురాండ్రనియు, రామరాజు భార్య

యైన మోహనాంగియనునామె "మారీచిపరిణయ"మను నైదాశ్వాసముల శృంగారప్రబంధము రచియించెననియు, ఒకరు వ్రాసియున్నారుగాని మాకాగ్రంథము లభింపకపోవుటచేత నిది యిట్లని నిశ్చయింపఁజాలకున్నాము. కృష్ణదేవరాయని యల్లుఁడైన రామరాజు భార్యపేరు మోహనాంగియైనట్లు సహితము గానఁబడదు. అయినను మోహనాంగియను పేరు తిరుమలాంబకు నామాంతరమై యుండవచ్చును:—మంత్రియైన తిమ్మరుసుయొక్క బుద్ధిబలముచేతను మంత్రశక్తిచేతను కృష్ణరాయని కధిక విఖ్యాతికలిగెనని చెప్పుదురు. ఇంటిపేరు సాళువవారైనట్లనేక శిలాతామ్రశాసనములవలనను, కృష్ణరాజవిజయమువలనను దెలియవచ్చుచున్నందున, ఈ మంత్రిశిఖామణి క్షత్రియుఁడైనట్లు కొందఱు తలంచుచున్నారు. అయినను గృష్ణామండలములోని కొండకాపూరి దేవాలయములోని యొక శిలాదానశాసనములోమాత్ర మాతనిపేరు సాళువతిమ్మరుసయ్యంగారని వ్రాయఁబడియున్నది. అయ్యంగారని యుండుటనుబట్టి కొందఱాతఁడు బ్రాహ్మణుఁడని భ్రమపడినను, "సాళువ"యనెడి యింటిపేరునుబట్టియు నితర నిదర్శనములనుబట్టియు నతఁడు బ్రాహ్మణుఁడు కాఁడనియు "అయ్యంగార"ని గౌరవార్థముగా నుపయోగింపఁబడెననియు నిశ్చయింపవలసియున్నదని స్యూయల్ దొరవారు వ్రాసియున్నారు. మాదయ్యగారి మల్లన్న యీ మంత్రిశిఖామణి యల్లుఁడగు నప్పామాత్యున కంకితమొనర్చిన రాజశేఖరచరిత్రమువలన నితఁడు బ్రాహ్మణుఁడేయనియు, నాఱువేల నియోగియనియు, నిస్సందేహముగాఁ దెలియవచ్చుచున్నది. ఈ సాళువతిమ్మరాజు కృష్ణరాయని తండ్రియైన నరసింహరాజు తమ్ముఁడని కొందఱు చెప్పిరి. ఈ సంగతి యథా

ర్థము కాకపోయినను, అతఁడు నృసింహరాయనియొద్ద మంత్రిగా నుండెను. ఈర్ష్యచేత నృసింహరాయని పట్టమహిషి సవతికొడు కైన కృష్ణదేవరాయనిఁ జంపింప యత్నించినప్పుడాతనిని దన యొద్ద నుంచుకొని కాపాడిన దీ సాళువతిమ్మరుసే. ఈ హేతువు బట్టియే కృష్ణదేవరాయలు తిమ్మరుసు నప్పాజీయని పిలుచుచుం డుటయు సుప్రసిద్ధము. ఈ మంత్రి శిరోమణి 1515-వ సంవ త్సరమునందు రాజు కొండవీటిమీఁదికి దండెత్తినప్పుడు తాను సేనాధిపతిగానుండి సేనలను నడిపి కొండవీటిదుర్గమును జయిం చెను. ఈతఁడు కృష్ణదేవరాయలకంటె మూఁడు సంవత్సరములు ముందుగా ననఁగా హూణశకము 1527-వ సంవత్సరమునందు మృతినొందెను. కృష్ణదేవరాయనికిఁ బుత్రసంతానము లేనట్లే యనేకస్థలములయందుఁ జెప్పఁబడియున్నది. అచ్యుతదేవరా యలే కృష్ణదేవరాయని పుత్త్రుఁడని యొకచోటను, సదాశివ దేవరాయలు కృష్ణదేవరాయని పుత్త్రుఁడని యొకచోటను చెప్పఁ బడెనుగాని వాని సత్యమునుగూర్చి యింకను సందేహింపవలసి యున్నది. కృష్ణదేవరాయని మరణకాలమునందాతని కిద్దఱు కొమార్తెలుండిరి. వారికప్పటికి వివాహము కాలేదు. తరువాత తిరుమలదేవి కొమార్తెను రామరాజును, చిన్నాదేవి కొమార్తెను దదనుజుఁడైన తిరుమల దేవరాయఁడును పరిణయమైరి. ఇట్లు కర్ణాటరాజ్యమును మహోచ్చదశయందుంచి కృష్ణదేవరా యలు శుక్లసంవత్సర వైశాఖమాసము మొదలుకొని వికృతి సంవత్సరమువఱకును ఇరువదియొక్క సంవత్సరములు రాజ్యము చేసి హూణశకము 1530-వ సంవత్సరమునందుఁ గీర్తి శేషుఁ డయ్యెను.

# దమయంతీస్వయంవరము.



1. క. దమయంతికి నలునకు సం
గమకారణదూతయైనకలహంస మనో
జ్ఞమనుష్యవాక్యముల న
ద్దమయంతికి హర్ష మెసఁగఁ దానిట్లనియెన్.

2. వ. నీ హృదయేశ్వరుండైన నలునొద్దనుండి వచ్చితి, అపారపారావార పర్యంత మహీతలంబునందు నాచూడనిరాజు లెవ్వరును లేరు, సర్వ గుణ సౌందర్యంబుల నెవ్వరు నలుంబోలరు.

3. తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁ
గాక నీసముజ్జ్వలరూపకాంతివిభవ
నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్ర
లక్షణావళు లవిసఫలంబులగునె.

4. వ. నీవు నారీరత్నంబవు, అతండు పురుషరత్నంబు, మీయిద్దఱ సమాగ మంబ న్యోన్య శోభాకరంబగును. అనినవిని సంతృప్తహృదయ యయి దమయంతి దానికిట్లనియె.

5. మధ్యాక్కర. ఆరాజుగుణములు నాకు నెఱిఁగించినట్టుల నన్ను
నారాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు
మారంగననవుడు నిషధదేశంబున కరిగిహంస
వీరసేనజునకు దానిగుణరూపవిభవముల్ సెప్పె.

6. వ. అంత

7. చ. నలదమయంతులిద్దఱు మనఃప్రభవానలబాధ్యమానలై
నలిపిరిదీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసార పాం
సులన్
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్.

8. వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణ శ్రవణసంజాతప్రీతులై యుండునంత నంతఃకరణ సంతతమనోజాత సంతాపవివర్ణవదనయైన యాదమయంతిం జూచి భయసంభ్రమాక్రాంత హృదయలగుచు సఖీజనంబులెల్ల నక్కోమలి వృత్తాంతంబంతయు భీమున కెఱింగించి యిట్లనిరి

9. సీ. కలహంసపలికినపలుకులు గణియించు
వడిదానిపోయినవలను సూచుఁ
బలుకదుసఖులతో లలితాంగిమిన్నక
యలయుచునుండుదాననుదినంబు
చారువిభూషణాహారవిహారశ
య్యాసనభోగంబులందువిముఖి
యయిరేయివగలునిద్రయు నెప్పు డెఱుఁగక
దమయంతినలుఁడను ధరణినాథు,
ఆ. నందబుద్ధినిలిపి కందర్పబాధిత
యగుచునున్నయది ధరాధినాథ
ధరణిపతుల నోరుల నురుగుణాఢ్యులఁ గిన
నొల్లదెంతవిభవయుక్తులైన.

10. వ. అనినవిని భీముండేమిసేయుదు నెవ్విధంబున నమ్మహీపతి నిటకు రావింపనగునోయని చింతించుచు సంప్రాప్తయౌవనయైన కూఁతుం జూచి యప్పుడు

11. క. ఆవైదర్భుఁడు నిఖిల ధ
రావలయములోనఁ గలుగు రాజన్యుల నా
నావిషయాధీశ్వరులను
రావించెఁ దత్స్వయంవరవ్యాజమునన్.

12. క. మనుజేశ్వరులెల్లను బో
రన దమయంతీస్వయంవరమునకు నొప్పన్
జనుదెంచిరి సైన్యస్వం
దనఘట్టన నవనితలముతల్లడపడఁగన్.

13. వ. తత్సమయంబునఁ బర్వతనారదులను పురాణమునులు భూలోకం బెల్లం గ్రుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నింద్రుండువారిం బూజించి భూలోకంబున కుశలవార్త యడిగి యిది యెట్లు ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహతులైనరాజు లక్షయ లోకసుఖంబు లనుభవింప నతిథులై యిందులకెంతకాలంబయ్యె. దాని కారణం బేమి యనిన నయ్యింద్రునకు నారదుండిట్లనియె.

14. క. సరసిద్ధసాధ్యవిద్యా
ధరసురకన్యకలకంటె దమయంతియ సుం
దరిదానిసుస్వయంవర
మరుదై వర్తిల్లుచున్నయది యిప్డుమహిన్.

15. క. అందులకుధరణిఁగలనృప
నందనులెల్లను ముదంబునంబోయెదరు వే
డ్కందమలోఁగయ్యమ్ములు
గ్రందుగలేకున్నవారు గడునెయ్యమునన్.

16. వ. అనినవిని యింద్రుండును లోకపాలవరులును దదాలోకన కౌతుకంబునం గనకరత్న రమ్యవిమానారూఢులై భూలోకంబునకువచ్చి దమయంతీస్వయంవరంబునకుం బోయెడువాని నాదిత్యులలోన విష్ణుండునుంబోలెఁ దేజోధికుండైనవాని ననన్యసాధారణరూప విభ

వంబున రెండవమన్మథుండునుంబోలె వానిఁ నలుంగనిం యంతరిక్షంబున నవిమానంబులునిలిపి భూతలంబునకు వచ్చి వానికిట్లనిరి.

17. సీ. నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా
కమరంగ దూతవై యభిమతంబు
సేయుము నావుడుఁ జెచ్చెరనట్టుల
చేసెద మఱినాకుఁ జెప్పుఁడ మీర
లెవ్వార లేనుమీకిష్టంబుగా దూత
నై యేమిసేయుదు ననిననతని
కమరేశ్వరుండిట్లులనియె నేనింద్రుండ
వీరుదిక్పాలురు విదితయశులు,

ఆ. ధరణినొప్పుచున్న దమయంతిసుస్వయం
వరముఁజూచువేడ్కవచ్చియున్న
వార మీవుమమ్ము వారిజాక్షికి నెఱిం
గింపు నామధేయకీర్తనముల.

18. వ అట్లైన నక్కోమలి మాయందుఁ దనవలచువాని వరియించుననిన నింద్రునకుఁ గృతాంజలియయి నలుండిట్లనియె.

19. ఆ. ఎఱిఁగియెఱిఁగినన్ను నేకార్థసమవేతుఁ
బాడియయ్య యిట్టిపనికిఁబనుప
ననిన నుత్సుకుండవై యేలచేసెద
నంటి చేయకుండనగునెనీకు.

20. ఆ. నిన్ను నిత్యసత్యనిరతుఁగానెఱిఁగి యి
క్కార్యమునకువలను గలుగుటెఱిఁగి
పనుపవలసెదూతభావమపేక్షించి
దేవహితముదీనిఁ దీర్పవలయు.

21. వ. ఆయుధీయసురక్షితంబైన రాజగృహంబెట్లు చొరనగునని శంకింప వలదు, దమయంతీ నివేశంబుఁ బ్రవేశించునపుడు నిన్నెవ్వరు వారింప నోడుదురు, అని శక్రువచనంబుల నశంకితుండై నలుండొక్కరుండ విదర్భాపురంబునకుం బోయి దమయంతీగృహంబుసొచ్చి.

22. సీ. హంసచేఁదనవినినంతకంటెనురూప
విభవాతిశయముల వెలయుదాని
సురకన్యకలయట్టిసురుచిరశతకన్య
కాళిచేఁబరివృతయైనదాని
హృదయేశుఁడైన తన్నెప్పుడువినుచున్కి
నలయకాశ్వాసితయైనదాని
దమయంతిఁజూచి కందర్పశరావిద్ధుఁ
డయ్యెనలుం డంతనతనిఁజూచి,

ఆ. యితఁ డపూర్వమనుజుఁ డెందుండివచ్చెనో
యనుచునదరిపడి లతాంగులెల్ల
నాసనములడిగ్గి యపుడుప్రత్యుద్గత
లైరి మనములందుహర్ష మెసఁగ.

23. క. దమయంతి మనోభవనిభు
నమరేంద్రప్రతిము దినకరాభు సుధాంశు
క్షము వరుణసదృశు ధనదో
పము నశ్విసమాను నిషధపతిఁ జూచినలుఁ.

24. క. వారిరుహనేత్ర మదన
ప్రేరితయై లజ్జయుడిగి భీతిల్లక బృం
దారకమూర్తికి రాజకు
మారున కిట్లనియెమందమందమృదూక్తిన్.

25. వ. నీవు మహానుభావుండ విందుల కేమి కారణంబున నేకతంబ వచ్చి తివి! ఇది యత్యుగ్రశాసనుండైన మదీయజనకుచేత సురక్షితంబగుట నెవ్వరికిం జొరనశక్యంబు. దీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబు నంజొచ్చితి. నాకు మనోవేదనాపివర్ధనుండవైన నీ తెఱంగెఱింగింపు మనిన దానికి నలుండిట్లనియె.

26. ఆ. ఏను దేవదూత నింతి నలుండను
వాఁడ నింద్రధనదవరుణయములు
నీస్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ
నరుగుదెంచి నన్ను నబలమున్న.

27. క. నీయొద్దకుఁ బుత్తెంచిరి
మాయందొక్కరునినిష్టమతివరియింపఁ
దోయజముఖిఁ బ్రార్థింపుము
మాయందఱు ప్రియ మొనర్పుమా సంప్రీతిన్.

28. వ. అని పంచినఁ దత్ప్రభావంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి, ఇంద్రాదులకుఁ బ్రియంబు సేయుము; అనిన నవనతవదనయై దమ యంతి తొల్లి హంసచేత నలు విని వానియందబద్ధానురాగయయి నవ యుచున్నయది యపుడతని నెఱింగి తద్వచనశ్రవణదుఃఖాయమాన మానస యగుచు నిట్లనియె.

29. తరువోజ. ఏనేడ నింద్రాదులేడ వారలకు
నెప్పుడు మ్రొక్కుదు నేనునీధనము
భూనాథ నీగుణంబులు హంసచేతఁ
బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన భవన్నిమిత్తమున నిట్లఖిల
ధారుణీనాథసార్థంబు రావింపఁ
గానిష్ట్రవలసె లోకఖ్యాతకీర్తి
కరుణించిపతిబుద్ధిఁగావింపుమిందు.

30\. వ. నీవు దీనికోడంబడని నాఁడు రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణపరిత్యాగంబు సేసికొందుననిన దానికి నలుండిట్లనియె.

31\. మత్తకోకిల. భూరిసత్త్వులు సర్వలోకవిభుల్ విభూతి సమృద్ధులి
ద్ధోరుకీర్తులు నిన్నుఁ గోరుచునున్న వా రమరోత్తముల్
వారి పాదరజంబుఁ బోలనివాని నన్ను మనుష్యసం
సారిఁ గోరఁగఁ జన్నెనీకుఁ బ్రసన్నులై సురలుండఁగాఁ.

32\. క. దేవతల కప్రియంబులు
గావించి మనుష్యులధమగతులగుదురెలఁ
గావున వారికినిష్టముఁ
గావింపుము నన్నుఁబ్రీతిఁగావుము తరుణీ.

33\. వ. అనిన దమయంతి నయనాంతర్గళితబాష్పధారాకలితకపోలయుగళయగుచుం బెద్దయుంబ్రొద్దు చింతించి నీయభిప్రాయంబునకు నిరపాయంబైన యుపాయంబుఁ గంటిని. ఇంద్రాదులు నాస్వయంవరంబునకు వచ్చెదరేని వారిసన్నిధిన నిన్ను వరియించెద, అట్లయిన నిర్దోషంబగును, అనిన నలుండు లోకపాలురపాలికింజని దమయంతిపలికినవిధంబుఁ జెప్పె, అంతఁ బుణ్యతిథి నక్షత్రముహూర్తంబున దమయంతీస్వయంవరంబు ప్రవర్తిల్లిన.

34\. ఆ. నలునకానినలినదళనేత్రవరియింప
దట్టి చూతమనుచు నమరవరులు
నలువురునుగడంగి నలరూపములవచ్చి
రాస్వయంవరమున కతిముదమున.

35\. వ. అంత.

36. సీ. దమయంతి సితపుష్పదామాభిశోభిత
హస్తయై చనుదెంచి యంబుజాక్షి
యమ్మహోత్సవదర్శనాగతరాజన్య
నివహంబు నీక్షించి నెమ్మితోడ
నలువురువేల్పులునలుఁదొట్టి యప్పు డే
కాకారులైయున్న నందునలుని
నేర్పరింపఁగనేర కింద్రాదులను నలు
నెఱుఁగునుపాయమింకెద్దియొక్కొ,
ఆ. యనుచు శంసయాకులాత్మయై సురలార
నలునెఱుంగువిధమునాకుఁజేయుఁ
డాత్మరూపధరులరగుఁ డనిపరిదేవ
నంబుసేసెఁదనమనంబులోన.

37. వ. దేవతలు దానిపరిదేవనంబువిని కరుణించి యనిమిషలోచనంబులు నస్వేదగాత్రంబులునొప్ప నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచిరి. అంత లోకపాలురు భూలోకంబునంగల రాజలోకంబు నాలోకించుచుండఁ బుణ్యశ్లోకుండయిన నలుఁధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయస్కంధంబున సుగంధికుసుమ దామకంబు వెట్టెన.

38. క. దేవతలసాధువాదము
తోడ విప్రాశీరవంబుతో బహుతూర్య
రావంబులు చెలఁగెను బా
రావారరవంబుఁబోలె ననివార్యంబై.

39. క. జగతీచక్రమునంగల
నగరమహాగ్రామపక్కణంబులుగలయన్
జగతీదేవోత్తములి
మ్ముగరోసిరి నిఖిలదేశములఁ గనిగి వడిన్.

40. వ. అందు సుదేవుండను బ్రాహ్మణుండు చేదిపతియైన సుబాహు పురంబునకుం జని పుణ్యాహవాచనంబు సేయింపంబోవు బ్రాహ్మణులతో రాజగృహంబుసొచ్చి యంతఃపురంబున సునందాసహితయై యున్న దాని ధూళిధూసరయై ధూమజాలనిబద్ధయైన యగ్నిప్రభయునుం బోలె నీలాభ్రసంవృతంబైన చంద్రరేఖయునుంబోలె బహుపంకనిమగ్నయైన మృణాళియునుంబోలె నేర్పడకున్నను దదీయభ్రూయుగమధ్యగతంబైన సూక్ష్మలక్షణం బిమ్ముగా నిరీక్షించి దమయంతిగ నెఱింగి యాత్మగతంబున నిది పతివియుక్తయై శుష్కప్రవాహంబైన నదియునుంబోలె శూన్యకమలంబైన నళినియునుంబోలె నొప్పకుండియుఁ దనపతివ్రతాత్వంబున నొప్పుచున్నది.

41. తే. అనపహార్యంబుఁ దేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియనుపమమును
భూషణంబిట్టివే పెఱ భూషణములు.

42. వ. రోహిణికిఁ జంద్రసమాగమంబునుంబోలె దీనికి భర్తృసమాగమం బె న్నండయ్యెడునో తుల్యశీలవయోరూపాభిజాత్యులైన నలదమయంతు లొక్కటనుండం జూచి విదర్భేశ్వరుండెన్నండు కృతార్థుం డయ్యెడునో యనుచు నల్లన దమయంతి కిట్లనియె.

43. తే. అవ్వ నీతల్లిదండ్రులకాత్మజులకు
బంధుజనులకుఁ గుశలంబభామనీదు
కుశలమెఱుఁగునంతకు వగఁగూరివగచు
చున్నవారువారలవంతయుడుగునింక.

44\. వ. దేవియేను భవద్భ్రాతృసఖుండ సుదేవుండను బ్రాహ్మణుండ విదర్భేశ్వరుండు నీయున్నచోటెఱుంగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నే నిందులకువచ్చి నాపుణ్యంబున నిన్నుం గంటి; అనిన దమయంతి వాని నెఱింగి తనతల్లిదండ్రుల బాంధవుల ప్రత్యేకంబ యడిగి యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నం జూచి యేలొకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్నయది యని సునందరాజమాతకుం జెప్పి పుచ్చిన.

45\. క. చనుదెంచె నంతిపురమున
వనితానివహంబుతోడ వారిజదళలో
చన రాజమాత నృపనం
దనయగు దమయంతికడకుఁ దద్దయువేడ్కన్.

46\. వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణునిం దమయంతిం జూచి రాజమాత బ్రాహ్మణునకిట్లనియె. అయ్యా యిది యెవ్వని కూఁతురు, ఎవ్వని భార్య, ఏమికారణంబునం దనభర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపుచున్నయది, దీని నీవెట్లెఱింగితి, ఇక్కోమలి నామం బేమి, అని యడిగిన సుదేవుం డిట్లనియె.

47\. మధ్యాక్కర. నలినాక్షి యిది విదర్భేశుతనయ పుణ్యశ్లోకుండైన
నలుదేవి దమయంతి సుమ్ము విధికారణంబున రాజ్య
చలితుండై నిజనాథుండరుగఁ దోడన చనెననువార్త
వెలయంగ విని వారిరోయఁబంచె భూవిభుండు బ్రాహ్మ
ణుల.

48\. వ. ఏ నిందులకువచ్చి మీచేత సురక్షితయై యున్న యిక్కోమలిం జూచి దీని భ్రూమధ్యంబునం బద్మనిభంబై విభూత్యర్థంబుగా విధాతృనిర్మితంబైన పుణ్యలక్షణంబు పాంసుపటలచ్ఛన్నంబయి యున్న నుపలక్షించి రాజపుత్రిం గా నెఱింగితి ననిన సునంద శుద్ధోదకంబుల దాని భ్రూమధ్యంబుఁ గడిగిన నప్పుడది స్పష్టంబగుడు నందఱు నాశ్చర్యంబంది రంత.

49. సీ. ఆనందభరితాత్మయై రాజమాత య
క్కమలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగిలించి
కొనితల్లి నీవు నాకూఁతురవేను నీ
జననియుఁ బేర్చిదశార్ణరాజు
తనయలమదియు విదర్భేశుసతియయ్యె
నేవీరబాహునకింతి నైతి
ననిన నయ్యవ్వకు నతివినయంబుతో
నలుదేవి మ్రొక్కి సునందనెత్రి,

ఆ. కొని కరంబు నెమ్మిఁ గొన్ని దినంబులం
దుండియిట్టులనియె నొక్కనాఁడు
దేవియిదియునదియు ధృతినాకుఁబుట్టిన
యిండ్లకడుసుఖంబ యిందునందు.

50. వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులం జూడ వేడ్క యుల్లంబునం బుట్టినయది, విదర్భకుం బోయెద నానతిమ్మని కృతాంజలియైన దమయంతి నతిస్నేహంబున సుబాహుజనని సుతప్రేషితబలంబుతో స్వర్ణరత్నమయ యానంబున నునిచి పుచ్చిన.

51. ఉ. భామ విదర్భకేగి తనబంధుజనంబులయొద్దనుండియుఁ
గోమల దేహసౌఖ్యములకు న్వెలియై మలినార్ధవస్త్రముఁ
భూమిరజంబునంగమునఁ బొల్పగుచుండఁగ నుండెజీవిత
స్వామి నిజేశుఁజూచు దివసంబులుగోరుచు సువ్రతం
బుతోఁ.

52. వ. ఇట్లు భర్తృవియోగాతురయైన దమయంతి ప్రాణంబు భరియింప నోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దనజనని కిట్లనియె.

53. క. శోకాపనోదిఁ బుణ్య
శ్లోకునలునిరోయఁబనుపు శుభచరితుఁ దదా
లోకనవిహీననై పర
లోకకృతావాస నగుదు లోకంబెఱుఁగన్.

54. వ. అనిన నదియును గూఁతునభిప్రాయంబు భీమునకెఱింగించిన నాతండును నలుమార్గణంబున బుజుమార్గులైన బ్రాహ్మణుల నియోగించినం దన పతి నన్వేషింపనరుగు బ్రాహ్మణులకు దమయంతి యిట్లనియె.

55. ఆ. నైషధేశ్వరుండు నలుఁడిప్పుడసమర్థుఁ
డగుటఁజేసి తన్ను నన్యులెఱుఁగ
కుండనుండుఁ గాననురుసభాంతరముల
కరియి గిరిగియట్టులనుఁడుమీరు.

56. సీ. సత్యనిత్యుండవు సతినింతివర్జించి
దాని వస్త్రార్థంబుఁ దఱిగినీవు
పరిధానముగఁజేసి పాడియేపోవంగ
భార్యభర్తయునాఁగఁబరఁగుధర్మ
మదిమిథ్యయయ్యె నీయందునీకిట్టి ని
ర్దయబుద్ధి చేకొనఁదగునెయట్టి
సాధ్వికిఁ గరుణాప్రసన్నుండవగుమని
యెల్లచోఁబలికిన నెవ్వఁడేని,

ఆ. పలుకఁబడఁగనోడి ప్రతివచనంబిచ్చు
నతఁడనలుఁడు గాఁగ నతిముదమున
నెఱిఁగి నన్ను నతని కెఱిఁగించితోడ్కొని
రండు రానినాఁడు రండెఱింగి.

57. వ. అని పంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన పలుకులెల్ల సకలదేశాధీశ సభలంబలికి యెందునుం గానక వచ్చిరి. అందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుండు దమయంతి కిట్లనియె. నేనయోధ్యకరిగి నీకఱపినపలుకులెల్ల ఋతుపర్ణసభం బలికిన నొక్క పురుషుండు కుఱుచ చేతులవాఁడు ఋతుపర్ణునొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబువాఁడు శీఘ్రయానకుశలుండు సూపక్రియానిపుణుండు విరూపాంగుండు బాహుకుండను నశ్వశిక్షకుండు విని నన్ను నేకాంతంబునకుం బిలిచి వెలవెలనగుచు దీర్ఘనిశ్వాసపురస్సరంబుగా నిట్లనియె.

58. ఆ. పురుషునందు దోషపుంజంబుగలిగిన
నెఱిఁగి యెదసహించునేనిభార్య
పురుషునందభీష్టభోగంబుదేహాంత
రంబునందు ధర్మరతియుఁబడయు.

59. వ. అని యొండెద్దియుంబలుకక తననివాసంబునకుఁ బోయెనని చెప్పిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి నలుండు కానివాఁడు ప్రతివచనం బేలయిచ్చు నింకను వలను గలవారలంబంచి యాతని నిమ్ముగా నెఱుంగవలయునని జననీజనకులయనుమతంబున సుదేవు రావించి వానికిట్లనియె.

60. క. నన్నెఱిఁగి తెచ్చినట్ల జ
గన్నుతునలునెఱిఁగి తెమ్ము కౌశలమునని
ద్విన్నాథ సర్వగుణసం
పన్నుండవునీవ యెందుఁ బరికింపంగన్.

61. క. అరుగుమయోధ్యకుదేశాం
తరవిప్రుఁడవై రవిప్రతాపోన్నతును
త్తరకోసలేశుభాంగా
సరినింగనుమనఘు నమరసముఁ ఋతుపర్ణున్.

62. వ. మఱియు విదర్భప్రభుండును భీమరథుండు నలు రోయంబంచి యొందు
నుంగానక దమయంతికి ద్వితీయస్వయంవరంబు రచియింపంబూనిన
నందులకు భూవలయంబునంగల రాజులెల్లను బోయెదరని యతిత్వ
రితంబుగా ఋతుపర్ణునకుం జెప్పుము, అనిపంచిన సుదేవుం డయో
ధ్యానగరంబునకుంబోయి ఋతుపర్ణుంగాంచి విదర్భాపురంబున దమ
యంతీద్వితీయస్వయంవరం బెల్లియయ్యెడునని చెప్పిన విని ఋతు
పర్ణుండు బాహుకుంజూచి నాకు దమయంతీద్వితీయస్వయంవరంబు
మూఁడ నెక్కునాఁడ విదర్భకుం బోవలయు, నీ యశ్వనైపుణ్యంబుఁ
ప్రకాశింపంజేయుము, అనిన నట్లచేయుదునని నలుండు దనమనం
బున దుఃఖించి.

63. ఆ. అడవిఁదన్నుఁబాసి యరిగిననలిగి కా
యిన్నెకట్లుచేయ నువిద గడఁగె
నిట్లయేనికూర్తురింతులుమాకని
విశ్వసించువారు వెడఁగులెందు.

64. ఆ. సాధ్వి నాకుఁగూర్చు సంతతికలయది
చెలువయిట్టులేల చేయునైన
నెఱుఁగవలయుదీని నేఋతుపర్ణుతోఁ
బోదు ననినలుండు బుద్ధిఁదలఁచి.

65. వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చిన తనరథంబునందు హయంబులనాలక్ష్య
మాణ శుభలక్షణంబులు వాయువేగంబులునైన వానింబూన్చి కొని
వచ్చిన ఋతుపర్ణుం డారథం బెక్కినప్పుడు హయంబులు క్రుగ్గి
నంజూచి యిప్పేదగుఱ్ఱంబు లతిదూరంబెట్లు పోవనోపు నొండు
గుఱ్ఱంబులం బూన్పు మనిన బాహుకుండిట్లనియె.

66. క. అవనీశ యీహయంబులు
పవనగతింబఱచుఁ బ్రొద్దువడకుండఁగ నేఁ
డవిదర్భకునవుడు విని
కువలయపతి మెచ్చి బాహుకునకిట్లనియెన్.

67. వ. అట్లయ్యున నీహయతత్త్వకౌశలంబెఱింగి నీకనభిమతంబొనరింతునని రథంబెక్కి బాహుకవార్ష్ణేయసహితుండయి యరుగువాఁడు.

68. మధ్యాక్కర. ఎదురను దవ్వులఁజూచిన పొడవులెల్లఁ దక్షిణమ
కదియఁగానవ్వి యెంతయును దవ్వాయి కనఁబడఁ బిఱుఁద
నిదిదినేశ్వరురథమో యనూరుఁడో యితఁడంచునపుడు
హృదయముననను గడువిస్మయంబందె నిక్ష్వాకుకులుఁడు.

69. వ. వార్ష్ణేయుండును విస్మయంబునొంది తనమనంబునన్.

70. క. ఈతండు శాలిహోత్రుఁడొ
మాతలియో నలుఁడొ యొరులు మానవులు జవో
పేతముగ నిట్లురథహయ
నీతియెఱుంగుదురె ధారుణీవలయమునన్.

71. వ. వయోవిద్యావైభవంబుల నితండు నలుంబోలెడి. వికృతరూపధరుం
డైన కారణంబేమియొ. మహాపురుషులు దేవనియుక్తులై ప్రచ్ఛన్న
వృత్తినుండుదురు. వారి నెఱుంగం బోలునె. అనుచుఁ జనునప్పుడు
ఋతుపర్ణుండు దన యుత్తరీయంబుజాఱి భూతలంబునంబడిన మరలి
చూచి బాహుకా వార్ష్ణేయుండు పోయి యుత్తరీయంబుఁ దెచ్చునం
తకు రథగమనం బించుకమందంబు సేయుమనిన బాహుకుండు నగి
నీయుత్తరీయంబు వడినయెడ యిచ్చోటికి నొక్కయోజనంబు గలదు.
దాని వార్ష్ణేయుం డెట్లుదేనేర్చునని రథగమనవేగ మాహాత్మ్యంబు
సెప్పుచు ననేకదేశంబులు గడచిచన నొక్కయెడ నగణ్యపర్ణఫలశా

ఖాలంకృతంబైన విభీతవృక్షంబుఁ గని ఋతుపర్ణుండు బాహుకున
కిట్లనియె.

72. ఆ. ఎల్లవారునెఱుఁగ రెల్లవానినిభిన్న
విషయులెల్లవారు విద్యలందుఁ
దొలఁగ కేనెఱుంగుదును దృష్టిమాత్రన
సకలమైనవస్తుచయముసంఖ్య.

73. వ. ఇవ్విభీతకంబున ఫలపర్ణసముదాయసంఖ్యఁ జెప్పెద వినుము. ఈ
రెండు శాఖలంగల పర్ణఫలంబులు పదివేలునొక్కండు తక్కిన
శాఖలం గలయవి రెండువేలుందొంబదేను. అనిన బాహుకుండు విని
వీనినెన్ని కాని నిశ్చయింప నేరనని రథంబు నిలిపి యావృక్షంబాక్ష
ణంబ యూరులం ద్రోచి యయ్యైశాఖల యాకులుఁ బండులు నెన్నిన
ఋతుపర్ణుఁడు సెప్పిన యన్నియయైన నచ్చెరువడి యివ్విద్య నాకు
పదేశింపవలయునని యడిగిన ఋతుపర్ణుండిట్లనియె

74. క. ఇదియక్షహృదయమనఁగా
విదితంబగువిద్య దీని విధ్యుక్తముగా
మదినెఱుఁగునరుఁడు సంఖ్యా
విదుఁడగు దుష్కృతకళంకవిషముక్తుఁడగుక్.

75. చ. సకలగుణప్రసిద్ధుఁడగు సర్వహితుండగుఁ జూవె
యంచు బా
హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశమిచ్చె న
త్యకుటిలబుద్ధినక్షహృదయంబు కరంబురయంబుతో విద
ర్భకుఁ జనువేడ్కఁజేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనః ప్రస
న్నుఁడై.

76. వ. ఇట్లు నలుండు ఋతుపర్ణుచేత నక్షహృదయంబుఁబడసి సంతుష్టుం
డయి నీకు నశ్వహృదయంబిచ్చెదఁ బరిగ్రహింపుము. అనిన ఋతు

పర్ణుండట్లుచేసెద అంతకు నీయందయుండనిమ్ము, అది నావలచినప్పుడ చేకొనియెదననియె. అంత నయ్యక్షహృదయసామర్థ్యంబున నప్పుడ.

77. క. నలుఁదొల్లియాక్రమించిన
కలికర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నొడలన్
వెలువడినలునకువిహితాం
జలియై తన్నెఱుఁగఁజెప్పెఁ జంచలుఁడగుచున్.

78. ఆ. వానిఁజూచి నలుఁడుదానల్గిశాపమీ
నున్నఁగలియెఱింగి నిన్నుఁబొంది
యహివిషంబుచేతననయంబుదగ్ధుండ
నైతి నింకనాకుననఘుసైఁపు.

79. వ. నిన్నుఁ గీర్తించినజనులు నావలని భయంబుఁబొందరు. నాకుం గుణింపుము. అనిన నలుండు కోపంబుడిగె. కలియునవ్విభీతకవృక్షంబు నాశ్రయించె. అదిమొదలుగా నవ్విభీతకంబ ప్రశస్తంబయ్యె. ఇట్లు నలుండు వికృతరూపమాత్రంబుదక్కఁ దక్కిన దుష్కృతంబుల వలన విముక్తుండయి రథంబెక్కి యతివేగంబున ఋతుపర్ణవార్ష్ణేయ సహితుండై విదర్భకుంజనియె, అంత సాయాహ్నంబున.

80. క. మానుగఋతుపర్ణుఁడు భీ
మానుజ్ఞాతుఁడయిచొచ్చె నాప్రోలురథ
ధ్వానంబు మ్రోయుచుండఁగ
నానాదిఙ్ముఖములను ఘనధ్వనివోలెన్.

81. సీ. దమయంతి యారథధ్వనివిని యిదినలు
రథఘోషమని యనురాగమొంది
నలునిషధేశుఁ బుణ్యశ్లోకు లోకోప
కారకుఁ జూడంగఁ గంటిననుచు

ఘనభుజుఁ జూడంగఁ గాననినాఁడుఁ ద
ద్భుజపరిరంభణమునను సుఖముఁ
బడయనినాఁడును బ్రాణంబువిడుతు నే
ననితలంచుచుఁ గమలాయతాక్షి,

ఆ. యారథాధినాథుఁ డైవచ్చు ఋతుపర్ణుఁ
జూచి యప్పుడధికశోకతప్త
యగుచునుండెనంత నాఋతుపర్ణుండు
భీముఁగానవచ్చెఁ బ్రియముతోడ.

82. వ. భీముండును వానింబూజించి యొక్కరమ్యహర్మ్యంబున విడియించిన ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరం బనుశబ్దంబు వినంగానక యాత్మగతంబున.

83. క. ధరణిఁగలరాజులిందె
వ్వరు వచ్చినవారులేరు వైదర్భియొరున్
వరియింపనంతధర్మే
తరచరితయొయనుచునుండెఁ దద్దయు లజ్జన్.

84. వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించియుండునంత దమయంతి బాహుకవార్ష్ణేయులతోడవచ్చిన ఋతుపర్ణుంజూచి విఫలమనోరథయైయుండనోపక కేశినియనుదానిం బిలిచి ఋతుపర్ణునయోధ్యాపతింగా వార్ష్ణేయు సూతపుత్త్రుంగా నెఱింగితి, బాహుకుండనువాఁడెవ్వండో వానియందు నాహృదయంబు కరంబు ముదితంబగుచున్నయది. మనపర్ణాదునకుఁ బ్రతివచనం బిచ్చినవాఁడు వాఁడగావలయు. వానికడకుంబోయి యెఱింగి రమ్మనిపంచిన నదివోయి బాహుకుంగని దమయంతి నీకుశలంబడుగఁ బుత్తెంచె, ఇందుల కేమికారణంబునవచ్చితిరి అనిన దానికి బాహుకుండిట్లనియె.

85. క. ప్రియమునఁ దమయంతి పున
స్స్వయంవరము సేయఁగడఁగి సకలక్షత్రా
న్వయవీరుల రావించిన
నయనిధి ఋతుపర్ణుఁ డొక్కనాఁటన వేడ్కన్.

86. క. వినవె శతయోజనంబులు
చనుదెంచె నయోధ్యనుండి సరియిందులకా
తని సారథినైయిటనే
నునువచ్చితివానితో మనోవేగమునన్.

87. వ. నావుడు మూఁడవవాఁడెవ్వఁడనియడిగిన నక్కేశినికి బాహుకుం
డిట్లనియె.

88. క. నలురథచోదకుఁడతఁడ
త్యలఘుఁడు వార్ష్ణేయనాముఁడనవుడు వాఁడ
న్నలభూపాలకుపోయిన
వలనిదియని యెఱుఁగునోయను వాఁడిట్లనియెన్.

89. వ. వార్ష్ణేయుండును నలుపుత్త్రుల విదర్భేశ్వరునొద్దం బెట్టిపోయి నలు
రాజ్యభ్రంశంబు విని ఋతుపర్ణుఁ గొలిచియుండె, ఆతండును నలు
నెఱుంగఁడు.

90. క. నలుతోనొక్కటపరిగిన
నలినాయతనేత్రభీమనందనయొంటన్
నలుఁడొండెఁగాక యెఱుఁగున్
నలునొరులకునెఱుఁగఁ గారణముగలదె మహిన్.

91. వ. అనిన విని కేశిని యిట్లనియె.

92. సీ. అడవిలో వస్త్రార్ధహారియై దయలేక
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాసిచనిన
నాఁటివస్త్రార్ధంబు నలినాక్షి యిప్పుడు
పరిధానముగఁ బాంసుపటలమలిన
మగుచున్నతనువుతో ననయంబు జడగొన్న
యలకావలులతోడ నవనితలము
శయనంబుగా ధర్మచారిణి దమయంతి
యనఘవ్రతంబుల నాచరించు,

ఆ. చున్న దనిన నవిరళోద్గతబాష్పపూ
ర్ణంబులైన లోచనంబు లెఱుక
పడకయుండ వదనపద్మంబు వాంచి తా
నొండువలను చూచుచుండె నలుఁడు.

93. వ. కేశినియును బాహుకుపలుకులు నాకారంబును దమయంతి కెఱిం
గించిన నది యాతని నలుంగా శంకించి యింకను వానికడ కేగుము.
వాఁడు ఋతుపర్ణువంటలవాఁడఁట. పచనసమయంబున వానిచరి
తం బిమ్ముగా నెఱింగిరమ్ము, అని పంచిన నప్పుడ చని కేశిని బాహుకు
నందున్న దైవమానుషనిమిత్తాద్భుతక్రియలు సూచివచ్చి దమయంతి
కిట్లనియె.

94. క. అతని చరితంబు సెప్పఁగ
నతిమానుషమపగతప్రయాసమదృష్ట
శ్రుతపూర్వము పరమార్థమ
యతనిని దైవమనవలయు నంబుజనేత్రా.

95. సీ. వినవమ్మ తృణముష్టిఁ గొనివాఁడు వీచిన
నందగ్ని యుదయించి యందువంట
లమరు నంతకు నింధనముల పేక్షింపక
యుడుగక మండుచు నుండు మఱియుఁ
గడఁకతో నంజుళ్లు గడుగంగ సమకట్టి
జలము పేక్షించుడు సంభవిల్లి
కుంభముల్ నిండి దివ్యాంభఃప్రవాహము
క్షయమగుచుండు నాక్షణము చూడ,

ఆ. నతనికరతలద్వయావమర్దితములై
కందియును మహాసుగంధకుసుమ
తతులు తొంటియట్ల తమకంపు విడువక
యుండు నతని తేజమున్నతంబు.

96. వ. అనిన విని దమయంతి వెండియుఁ గేశినిం బిలిచి బాహుకు వండిన నంజుళ్లు దెప్పించి యాస్వాదించి బాహుకునందు నలలక్షణంబులు గలుగుటెఱింగియు నూఱడనోపక వానిపాలికిఁ గొడుకునుం గూఁతునుం గేశినితోడఁ బంచిన నక్కుమారునిఁ గూఁతుం జూచి

97. ఆ. వశముగాక బాష్పవారి యొల్కుచు నుండఁ
గొడుకుఁ గూఁతు నెత్తికొని నలుండు
హర్షపులకితాంగుఁడై నిజాంకతలంబు
నందు వారి నునిచి యాదరమున.

98. వ. అక్కేశినిం జూచి యిక్కుమారులిద్దఱు నాకొడుకునుం గూఁతునుం బోలిన వీర నెత్తికొని దుఃఖించితినని తన్నేర్పడకుండం బలికి దానికిట్లనియె.

99\. క. నీవిటఁబలుమఱువచ్చుచుఁ
బోవుచునునికిఁగని చిత్తములనొండుగ సం
భావింతురితరజనములు
కావునరావలవదింకఁ గార్యార్థినివై.

100\. వ. ఏము దేశాంతరంబుననుండి వచ్చిన యతిథులము, నీకు మాతోడి దేమి, అనినఁ గేశినియుఁ గ్రమ్మఱివచ్చి బాహుకుమార్గంబంతయును దమ యంతికిం జెప్పిననది సంతసించి నిజజనని కిట్లనియె.

101\. ఉ. సందియమేల సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండు భూ
వందితుఁడైన నైషధుఁడె నశ్వముదానగు నామనంబునా
నందముఁ బొందుచున్నది ఘనంబుగ నాఁడిట వచ్చు వాఁడొ యే
నందుల కేగుదాన నొనయంబుగ నానతియిమ్ము నావుడున్.

102\. వ. అది యప్పుడు భీమునను మతంబున దమయంతియొద్దకు బాహుకు రావించిన.

103\. క. చనుదెంచియుందుదీనా
ననవిరళపంకమలినతగాత్రఁదప
స్వినినతికృశదమయంతిం
గనియెనలుం డుదితబాష్పకణకలితముఖిన్.

104\. క. దమయంతి నలునివికృతాం
గముఁజూచియు నతని నన్యుఁగావగవక నె
య్యమునను లజ్జనుభయసం
భ్రమమున వివశాత్మయగుచుఁ బతికిట్లనియెన్.

105. వ. విజనంబైన విపినంబున నలసి నిద్రవోయినయబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధిం బాణిగ్రహణ విధిలబ్ధయైనదానిం బాసి నలునట్లు నిర్దయులై యరిగిన వారలూరులెవ్వరు లేరు.

106. క. సురవరులను మెచ్చక తను
వరియించిన నన్నుఁ బుత్రవతి నేలొకొ చె
చ్చెరవిడిచె నాతనికిని
ష్కరుణున కేనేమియెగ్గుగావించితినో.

107. వ. ప్రాణసమానవైన నిన్ను విడువనోడకుండు మనిన యప్పలుకు తేల మఱచెనో యని శోకతప్తంబైన తనహృదయంబుఁ దడుపుచున్నదియునుంబోలె బాష్పధారల నురస్స్థలంబుఁ దడుపుచున్న దమయంతిం జూచి దుఃఖాకులుండై నలుండిట్లనియె.

108. తే. కలిసమావిష్టమతినయికష్టవృత్తి
నట్టియిడుమనుబడితి నేనదిమదీయ
తపముబలమున దుష్కర్మదహనమునను
నష్టమైపోయెనిప్పుడు నన్నువిడిచి.

109. వ. ఏనిందులకు నేతదర్థంబువచ్చితి నదియట్లుండె, నన్ను ననురక్తుననువ్రతుఁదలంపక యన్యాపేక్షం బునస్స్వయంవరంబు రచియించుటది కులస్త్రీధర్మంబుగాదు, రాజులనెల్ల నీస్వయంవరంబునకు రావించుటంజేసికాదె ఋతుపర్ణుండు వచ్చె, అనిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె.

110. తే. నిన్నరోయంగ విప్రులు నెమ్మినరిగి
పలికిరెల్లచో నాచేతఁ బలుకఁబడియ
యందుఁ బర్ణాదుఁడనువిప్రుఁడయ్యయోధ్య
కేగి ప్రతివచనంబుల నెఱిఁగె నిన్ను.

111. వ. ఆపర్ణాదువలన నెఱింగినదాననై నిన్నిటరావించు నుపాయంబుఁ దలంచి యెల్లి దమయంతీ ద్వితీయస్వయంవరంబగునని ఋతుపర్ణుకడం బ్రకాశింప సుదేవుండను బ్రాహ్మణుం బుత్తెంచితి.

112. క. నరవరుఁడు నలుఁడుకా కె
వ్వారు శతయోజనము లొక్కవాసరమున వ
త్తురు నరులారులని దీనిం
బరికింపఁగ వేఁడి యిట్లు పంచితినధిపా.

113. ఉ. ఏనతిపాపభావమున నెగ్గు దలంపఁదలంపకొండుగా
నానతవైరి నీయడుగులంటఁగనోపుదు నట్లయైన న
న్నీనలినాప్తుఁ డీయనలుఁ డీమృగలాంఛనుఁ డీసురోత్త
ముల్
జానువడంగనాక్షణమచంపరె కోపపరీతచిత్తులై.

114. వ. అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుండైన వాయు
భట్టారకుఁ డెల్లవారునువిన నాకాశంబుననుండి నలున కిట్లనియె.

115. చ. అమలచరిత్రనిట్లు దమయంతిఁ బతివ్రతఁబల్కు దే
న్నృపో
త్తమవిను దీనియందు విదితంబగు శీలనిధిన్ సుధాం
శుఁడున్
గమలహితుండు నేనుఁ దగఁగాచితి మొక్కట మూఁడు
వర్షముల్
గొమరుగ దీనిఁజేకొనుము కోమలి నీకనురక్తనావుడున్.

116. క. కురిసెమరుద్వచనానం
తరమున సురపుష్పవృష్టి తడయకమ్రోసెన్
సురదుందుభి నాదంబులు
గరము ప్రశస్తముగ వీఁచె గంధవహుండున్.



## దమయంతీస్వయంవరమునందలి కఠినపదములకర్థము.



(1) సంగమకారణదూత = కూడికకు హేతువగుదూత. మనోజ్ఞ మనుష్యవాక్యములన్ = మనోహరమైన మనుష్యునియొక్క మాటలవంటి మాటలతో.

(2) అపార, పారావారపర్యంత, మహీతలంబునందున్=దరిలేని సముద్రము వఱకుఁగల, భూప్రదేశమునందు. సర్వగుణ సౌందర్యంబులన్=సమస్త మైన మంచిగుణములచేతను, చక్కఁదనముచేతను.

(3) నీ సముజ్జ్వల... ఆవళులు=నీ=నీయొక్క. సముజ్జ్వల, మిక్కిలి ప్రకాశించెడు. రూప=చక్కఁదనము. కాంతివిభవ = కాంతియొక్క సంపద. నిత్య=శాశ్వతమైన. సౌభాగ్య=సమృద్ధి, భాగ్య, అదృష్టము ఆభిజాత్య = గొప్ప కులమందలి పుట్టుక. భద్ర=శుభకరములైన. లక్షణ= గుఱుతులయొక్క. ఆవళులు=వరుసలు.

(4) అన్యోన్య శోభాకరంబు=ఒండొరులకుఁ గాంతినిఁ గలుగఁజేయునది. సంతృప్తహృదయ = మిక్కిలి తనివిఁజెందిన మనస్సుగలది.

(5) దాని, గుణ, రూప, విభవములు = ఆ దమయంతియొక్క మంచిగుణములయొక్కయు, సౌందర్యముయొక్కయు, సంపదలను.

(7) మనఃప్రభవా, నల, బాధ్యమానలు=మన్మథునియొక్క అగ్నిచేత పీడింపఁబడుచున్నవారలు. విలసన్నవచందనంబులన్=ప్రకాశించెడు, క్రొత్తవైన, శృంగారవనములయందు నలినదళంబులన్ = తామరపూరేకుల చేతను. ఘనసార పాంసులన్=పచ్చకర్పూరముయొక్క పొళ్లచేతను. దీర్ఘవాసరనిశలు = నిడుదలైన పగళులును రాత్రులును.

(8) అన్యోన్యరూప... ప్రీతులు=ఒండొరులయొక్క చక్కఁదనముయొక్కయు, మంచిగుణములయొక్కయు వినికివలన కలిగిన ప్రేమగలవారలు. అంతఃకరణ..... వదన=మనస్సునందలి, ఎడతెగని, మన్మథునియొక్క,

వేఁడిమిచేత, వర్ణముమాఱిన, ముఖముగలది. భయ . . . . . . హృద యలు=వెఱపుచేతను, తత్తరపాటుచేతను, క్రమ్ముకొనఁబడిన, మనస్సు గలవారలు.

(9) చారు . . . భోగంబులందుఁ = చారు=రమ్యమైన. విభూషణ=ఆభరణ ములయొక్కయు. ఆహార=భోజనములయొక్కయు. విహార=విహరించు టలయొక్కయు. శయ్యా = పాన్పులయొక్కయు ఆసన=పీఠముల యొక్కయు. భోగంబులందుఁ = సుఖములయందు. ఉరుగుణాఢ్యు లఁ=గొప్పగుణములచేత నిండియున్న.

(10) సంప్రాప్తయౌవన = పొందఁబడిన వయస్సుగలది.

(11) నానావిషయాధీశ్వరులఁ = పెక్కులైన దేశములకు అధిపతులైనవారలను.

(12) సైన్యస్యందనఘట్టనఁ = సేనలలోని రథములయొక్క అదుముడుచేత.

(13) ధర్మ, పరిపాలన, పరులు=నీతితో, ఏలుటయందు ఆసక్తిగలవారు.

(15) నెయ్యమునఁ = స్నేహముతో, కయ్యమ్ములు=యుద్ధములు.

(16) తదాలోకన కౌతుకంబునఁ=తత్ = ఆ స్వయంవరముయొక్క. ఆలో కన = చూచుటయందలి. కౌతుకంబునఁ = కోరికచేత. కనక . . . ఆరూఢులు = కనక = బంగారముచేతను. రత్న =మణులచేతను. రమ్య= మనోహరములైన. విమాన=విమానము లను. ఆరూఢులు=ఎక్కినవారలు. అనన్య . . . విభవంబునఁ = అనన్య సాధారణ = ఇతరులయందు లేని. రూప = సౌందర్యముయొక్క. విభవంబునఁ=సంపదచేత.

(17) నిత్యసత్యవ్రత=స్థిరమైన సత్యమే వ్రతముగాఁగల. విదితయశులు=ప్రసిద్ధి కెక్కిన కీర్తిగలవారు. నామధేయకీర్తనములఁ = పేరులచేతను పొగ డుటలచేతను.

(18) కృతాంజలి=చేయఁబడిన దోసిలిగల. (నమస్కరించిన)

(19) ఏకార్థసమవేతుఁ=ఒక్క ప్రయోజనముతో సంబంధించియున్న. ఉత్సు కుండు=తమిగలవాఁడు.

(20) నిత్యసత్యనిరతుఁగాఁ=స్థిరమైన సత్యమందు ఆసక్తిగలవానిఁగా.

(21) ఆయుధీయసురక్షితంబు=ఆయుధజీవనులచేత లెస్సగాఁ గాపాడఁబడినది. శక్రువచనంబులన్=ఇంద్రుని మాటలచేత.

(22) సురకన్యకలయట్టి...... ఆళిచేన్ = సురకన్యకలయట్టి = దేవతాస్త్రీల వంటి. సురుచిర=మిక్కిలి మనోహరలైన. శతకన్యకా=పెక్కుస్త్రీల యొక్క. ఆళిచేన్=వరుసచేత. కందర్పశరావిద్ధుఁడు=మన్మథునియొక్క బాణములచేత (శరీర) మంతయు గ్రుచ్చఁబడినవాఁడు. ప్రత్యుద్గతలు= ఎదురుకొనినవారు.

(23) అమరేంద్రప్రతిమున్=ఇంద్రునకు తుల్యుఁడును. సుధారుక్సమున్= చంద్రునితో సమానుఁడును.

(24) బృందారకమూర్తికిన్ = దేవతాశరీరమువంటి శరీరముగల. మందమంద మృదూక్తిన్=మిగుల తిన్నని మృదువైన మాటలతో.

(25) మనోవేదనావివర్ధనుండవు=మనోబాధను వృద్ధిబొందించువాఁడవు.

(26) ఇంద్రధనదవరుణయములు = ఇంద్రుఁడు, కుబేరుఁడు, వరుణుఁడు, యముఁడును.

(28) అలక్షితుండను=చూడఁబడనివాఁడను. అవనతవదన=వంచఁబడిన ముఖము గలది. తద్వచన......మానస = తద్వచన=అతని మాటలయొక్క. శ్రవణ=వినుటవలన. దుఃఖాయమాన=దుఃఖముచెందుచున్న. మానస= మనస్సుగలది.

(29) లోకఖ్యాతకీర్తి=జగమునందు ప్రసిద్ధికెక్కిన కీర్తిగల. అఖిల...సార్థం బు = అఖిల = సమస్తమైన. ధారుణీనాథ=రాజులయొక్క. సార్థంబున్= సమూహంబును.

(30) రజ్జు...జలంబులన్=రజ్జు=త్రాళ్లచేతనైనను. విష = విషముచేతనైనను. అగ్ని=అగ్నిచేతనైనను. జలంబులన్=నీళ్లచేతనైనను.

(31) విభూతిసమృద్ధులు = ఐశ్వర్యముచేత నిండినవారలును. ఇద్ధోరుకీర్తులు= పరిశుద్ధమైన గొప్ప యశస్సుగలవారును.

(32) అధమగతులు=తక్కువమార్గముగలవారు. (నరకమును పొందువారు.)

(33) నయనాంతర్గళిత . . . యుగళీ=నయనాంతర్గళిత = కన్నులనుండి జాఱిన. బాష్ప=కన్నీటియొక్క. ధారా = ధారలతోడ. కలిత = కూడుకొన్న. కపోల = చెక్కులయొక్క. యుగళీ = జంటగలది. నిరపాయంబు= హానిలేనిది.

(34) నలినదళనేత్ర = తామరపూవుల రేకులవంటి కన్నులుగల దమయంతి.

(36) సిత . . . హస్త=సిత=తెల్లని. పుష్పదామ=పూలదండలచేత. అభిశోభిత= మిక్కిలిప్రకాశించెడు. హస్త = చేతులుగలది. అమ్మహోత్సవ . . . నివహంబున్=అమ్మహోత్సవ=ఆ గొప్పవేడుకయొక్క. దర్శన=చూచుటకొఱకు. ఆగత=వచ్చిన. రాజన్య=రాజులయొక్క. నివహంబున్=సమూహమును. ఏకాకారులు=ఒక్కతీరగు రూపముగలవారు. ఆత్మరూపధరులరు=తమయొక్క ఆకారములను ధరించినవారలు. పరిదేవనంబు=మొఱ.

(37) అనిమిషలోచనంబులును=ఱెప్పపాటులేని నేత్రములును. అస్వేదగాత్రంబులును = చెమటలేని శరీరములును. సుగంధికుసుమదామకంబు= మంచివాసనగల పువ్వులహారమును.

(38) బహుతూర్యారావంబులు=పెక్కులైన వాద్యములయొక్క మ్రోఁతలు.

(39) జగతీదేవోత్తములు=బ్రాహ్మణశ్రేష్ఠులు.

(40) పుణ్యాహవాచనంబు=గృహాదిశుద్ధికొఱకైన కర్మము. ధూమజాలనిబద్ధ= పొగగుంపుచేతఁ జుట్టఁబడినది. నీలాభ్రసంవృతంబు=నల్లని మబ్బుచేతఁ గప్పఁబడినది. బహుపంకనిమగ్న=మిక్కిలి యడుసునందు మునిఁగినది. మృణాళి=తామరతీఁగ తదీయ . . . . . . మధ్యగతంబు=ఆమెదైన కనుబొమల జంటయొక్క నడిమిభాగమును పొందినది.

(41) అనపహార్యంబు=అపహరింప శక్యముగానిది.

(42) తుల్య . . . . . . ఆభిజాత్యలు=తుల్య=సమమైన. శీల= స్వభావమును. వయః=ప్రాయమును. రూప=సౌందర్యమును. ఆభిజాత్యలు=సత్కులమందు పుట్టుకయునుగలవారు.

(43) వగన్—కూరి=చింతనుపొంది.

(44) భవత్భ్రాతృసఖుండన్ = నీతోఁబుట్టువులకు స్నేహితుఁడను. పుచ్చినన్=పంపఁగా. అశ్రుజలంబులు=కన్నీళ్లు.

(47) విదర్భేశతనయ=భీమరాజుకూఁతురు. రాజ్యచలితుఁడు=రాజ్యమునుండి తొలఁగినవాఁడు.

(48) పద్మనిభంబు = కమలముతో సమానము. విభూత్యర్థంబు = ఐశ్వర్యము కొఱకు. విధాతృనిర్మితంబు = బ్రహ్మచేత నిర్మింపఁబడినది. పాంసుపట లచ్ఛన్నంబు=దుమ్ముగుంపుచేఁ గప్పఁబడినది.

(50) స్వర్ణరత్నమయ యానంబున = బంగారుతోఁ జేసిన మణులుచెక్కిన పల్లకియందు. సుత ప్రేషితబలంబుతోన = కొడుకైన సుబాహుని చేతఁ బంపఁబడిన సేనతోఁగూడ.

(51) మలినార్ధవస్త్రమును = మాసిన సగము చీరయును. సువ్రతంబుతోన= మంచి నియమముతో.

(52) భర్తృవియోగాతుర=పెనిమిటితో నెడఁబాయుటచేత పీడనొందినది.

(53) తదాలోకనవిహీనన=అతనియొక్క దరిశనము లేనిదానను. పరలోక కృతావాసన = పరలోకమందుఁ జేయఁబడిన ఉనికిగలదానను.

(54) నలుమార్గణంబునన=నలునియొక్క వెదకుటయందు. ఋజుమార్గులు= సరియగు నడతగలవారు.

(56) పరిధానము=కట్టువస్త్రము. మిథ్య=అబద్ధము.

(57) నీకఱపినపలుకులు = నీవు నేర్పినమాటలు. నూఱుగద్యాణంబుల జీవి తంబువాఁడు=నూఱువరహాల జీతమువాఁడు. శీఘ్రయానకుశలుండు= త్వరగా గుఱ్ఱముల నడుపుటయందు నేర్పరి దీర్ఘనిశ్వాసపురస్సరంబు- గాన=పొడుగు నిట్టూర్పు ముందు కలుగునట్లుగా.

(58) దోషపుంజంబు=తప్పులగుంపు. దేహాంతరంబునందున=మఱియొక జన్మ మున. ధర్మరతి=ధర్మమునందాసక్తి.

(60) విద్వన్నాథ = పండితులలో శ్రేష్ఠుఁడా. సర్వగుణసంపన్నుండవు=ఎల్ల సుగుణములచేత పూర్ణుఁడవు.

(61) రవిప్రతాపోన్నతున=సూర్యునియొక్క తేజస్సువంటి తేజస్సుచేత హెచ్చినవానిని. భాంగాసురిని=భంగాసురరాజుకొడుకైనట్టివాఁడును.

(62) రోయన్—పంచి=వెదకఁబంపి. ఎల్లి=రేపు. నీ యశ్వనైపుణ్యంబున్=నీకు గుఱ్ఱములయందుఁగల నేర్పును.

(63) ఇంతులు=స్త్రీలు. వెడఁగులు=మూఢులు

(64) నాకున్—కూర్చున్=నాయెడ స్నేహించును.

(65) అలక్ష్యమాణ శుభలక్షణంబులును = కానఁబడుచున్న మంచి సుడులు గలవియును. వాయువేగంబులును=గాలియొక్క వేగమువంటి వేగము గలవియును. మొగ్గినన్=ముందటికి నొరగఁగా. ఇప్పేదగుఱ్ఱంబులు=ఈ శక్తిలేని గుఱ్ఱములను.

(66) పవనగతిన్=వాయువుయొక్క నడకవంటి నడకచేత.

(67) నీహయతత్త్వకౌశలంబు=నీ యశ్వవిద్యయందలి నేర్పును.

(68) చూచినపాడవులు ఎల్లన్=కనుఁగొన్న (చెట్లుమొదలగు) ఆకృతులన్నియు. దినేశ్వరరథము=సూర్యునియొక్క రథము.

(69) విస్మయంబున్=ఆశ్చర్యమును.

(70) శాలిహోత్రుఁడు = శాలిహోత్రుఁడనెడి ఋషి. మాతలి=ఇంద్రుని సారధి. రథహయనీతి=రధాశ్వముల శాస్త్రమును.

(71) వయోవిద్యావైభవంబులన్ = వయస్సుయొక్కయు, చదువులయొక్కయు, సంపదలచేత. ప్రచ్ఛన్నవృత్తిన్ = రహస్యమైన నడవడికతో. అగణ్య . . . అలంకృతంబు = అగణ్య = లెక్కపెట్టనలవిగాని. పర్ణ=ఆకుల చేతను. ఫల=పండ్లచేతను. శాఖా=కొమ్మలచేతను. అలంకృతంబు=అలంకరింపఁబడినది. విభీతకవృక్షంబున్ =తాండ్రచెట్టును.

(72) ఎల్లవానిన్=అన్నివిషయములను. భిన్నవిషయులు=వేఱుపడిన విషయములు గలవారలు.

(73) ఫలపర్ణసముదాయసంఖ్యన్ = పండ్లయొక్కయు, ఆకులయొక్కయు, గుంపుయొక్క లెక్కను.

(74) సంఖ్యావిదుఁడు=లెక్క తెలిసినవాఁడు. దుష్కృతకళంకవిషముక్తుఁడు=పాపమువలనను, నిందవలనను, విషమువలనను, విడువఁబడినవాఁడు.

(75) పూర్ణమనః ప్రసన్నుఁడు=నిండుమనస్సుచేత సంతోషించినవాఁడు. అక్ష హృదయంబు=అక్షహృదయమను విద్యను.

(76) అశ్వహృదయంబున్=అశ్వహృదయమను విద్యను. పరిగ్రహింపుము= చేకొనుము.

(77) విహితాంజలి=మ్రొక్కినవాఁడు.

(78) అహివిషంబుచేతన్=సర్పవిషముచేత. దష్టుండైనను=కాల్పఁబడ్డవాఁడను.

(79) అప్రశస్తంబు = మంచిదికానిది. విముక్తుండు = విడువఁబడినవాఁడు. సాయాహ్నంబునన్=సాయంకాలమందు.

(80) ఘనధ్వని వోలెన్ = మేఘముల ధ్వనివలె. ఆప్రోలు=ఆ పట్టణమందు.

(81) తద్భుజపరిరంభణమునన్=అతని బుజేములయొక్క ఆలింగనముచేత.

(82) విడియించినన్ = విడిదిచేయింపఁగా. ఆత్మగతంబునన్ = మనస్సునందు.

(83) వైదర్భి=దమయంతి. ధర్మైకచరిత=న్యాయ్యమునకు వేరైన నడవడిక గలది

(84) సూతపుత్త్రున్, కాన్=సూతకులమందు పుట్టినవానిఁగా. ముదితంబు= సంతోషించినది.

(85) సకలక్షత్త్రాన్వయవీరులన్=క్షత్త్రియవంశమున పుట్టిన శూరుల నెల్లను. నయనిధి=నీతికి స్థానము.

(86) శతయోజనంబులు = నూఱామడలు.

(88) నలురథచోదకుఁడు = నలునిరథము తోలువాఁడు.

(90) భీమనందన = దమయంతి.

(92) ధర్మచారిణి = ధర్మమును ఆచరించునది. పరిధానము = కట్టువస్త్రము. పాంసుపటలమలినము = ధూళిసమూహముచేత మాసినది. అనఘవ్రతంబులన్=పాపరహితములైన నోములను. అవిరళ . . . పూర్ణంబులు=అవిరళ= దట్టముగా. ఉద్గత = వెలికివచ్చిన. బాష్ప = కన్నీళ్లచేత. పూర్ణంబులు = నిండినవి.

(93) పచనసమయంబునన్ = వంటచేయునప్పుడు. ఉన్న . . . క్రియలు= ఉన్న=ఉన్నట్టి. దైవ=దేవసంబంధియు. మానుష=మనుష్యసంబంధియు నగు. నిమిత్త=చిహ్నములను. అద్భుతక్రియలు= ఆశ్చర్యకరములైన కార్యములను.

(94) అతిమానుషము=మనుష్యశక్తికి మించినది. అపగతప్రయాసము=పోయిన శ్రమముగలది. అదృష్టశ్రుతపూర్వము=ముందు చూడఁబడనిది, వినఁ బడనిది. పరమార్థము—అ=యథార్థమే.

(95) ఇంధనములు = కట్టెలు. నంజుళ్లు = మాంసములు. దివ్యాంభఃప్రవాహము = మేలైన నీటివెల్లువ. మహాసుగంధకుసుమతతులు = మిక్కిలి మంచివాసనగల పూలయొక్క రాసులు. అతని . . . మర్దితములు=అతని= అతనియొక్క. కరతల=అఱచేతుల. ద్వయ=జంటచేత. అవమర్దితములు= నలపఁబడినవి.

(96) ఆస్వాదించి = రుచిచూచి. ఊఱడన్, ఓపక=ఊఱటఁ జెందియుం డఁజాలక.

(97) బాష్పవారి=కన్నీరు. హర్షపులకితాంగుఁడు = ప్రేమచేత గగుర్పాటు చెందిన దేహముగలవాఁడు. నిజాంకతలంబునందున్ = తన యొడిమీఁద.

(98) ఏర్పడక = బయలుపడక.

(101) భూవందితుఁడు=భూజనులచే స్తుతింపఁబడినవాఁడు. ఐననైషధుఁడు= ఐనట్టి నలమహారాజు. నయంబు= నీతి.

(103) అవిరళ . . గాత్రన్=అవిరళ=దట్టమైన. పంక=అడుసుచేత. మలిన= ముఱికినిబొందిన. నత=వంగిన. గాత్రన్ = దేహముగలది. తపస్వినిన్= దీనురాలిని. ఉదిత . . . ముఖిన్=ఉదిత=పుట్టిన. బాష్ప=కన్నీటి యొక్క. కణ=బొట్టులతో. కలిత=కూడిన. ముఖిన్=ముఖముగలది.

(104) వివశాత్మ=స్వాధీనముగాని మనస్సుగలది.

(105) అనువ్రతన్=అనుసరించిన వ్రతముగలదియు. పాణి. . . లబ్ధ=పాణి గ్రహణవిధి=వివాహవిధిచేత. లబ్ధ పొందఁబడినది.

(106) నిష్కరుణునకున్ = దయలేనివానికి.

(107) శోకతప్తంబు = దుఃఖముచే తాపము నొందఁబడినది. ఉరస్థలంబు ...మ్మును.

...ష్టమతిన్ = కలిపురుషునిచేత ఆక్రమింపఁబడిన బుద్ధి. సదీయతపముబలమునన్, దుష్కర్మదహనమునన్=నా... ...చేత చెడుకర్మములు కాలుటచేత.

(109) కులస్త్రీధర్మంబు = పతివ్రతాధర్మము.

(110) రోయన్, కాన్ అరిగి=వెదకుటకుఁబోయి.

(111) దమయంతీ ద్వితీయస్వయంవరంబు=దమయంతియొక్క పునస్స్వయంవరము. పుత్తెంచితిన్=పంపితిని.

(112) ఒక్కవాసరమునన్ = ఒక్కదినమందు.

(113) ఆనతవైరి=లోఁబడిన శత్రువులుగల రాజా. ఈ నలినాప్తుఁడు=ఈ సూర్యుఁడు. ఈ మృగలాంఛనుఁడు... జానువు= అందము.

(114) అఖిలభూతాంతర్గతుండు = ఎల్లప్రాణులలోపల సంచరించువాఁడు.

(115) అమలచరిత్రన్=పరిశుద్ధమైన నడతగలదియును. విదితంబు అగు శీలనిధిన్=ప్రసిద్ధమైన సదాచారమనెడి నిక్షేపమును.

(116) మరుద్వచనానంతరమునన్=వాయుదేవుని మాటవెంటను. సురదుందుభినాదంబులు=దేవతలభేరుల ధ్వనులు. గంధవహుండును=గాలియును వీఁచెన్=విసరెను.

